


# నన్నయ కవితా వైభవం

డాక్టర్ దివాకర్ల వేంకటావధాని

NANNAYA KAVITHAVAIBHAVAM
Selections from NANNAYA'S
Poetic Work with Commenetary
By Prof. Divakarla Venkatavadhani



**యువభారతి**

ప్రచురణ : **44**

ప్రథమ ముద్రణ : ప్రతులు **3,200**

**15 జనవరి, 1976**

ముఖచిత్ర రచన :

**శీలా వీర్రాజు**

ముద్రణ :

**జ్యోతి ప్రెస్, ముషీరాబాదు, హైదరాబాదు**

ముఖచిత్ర ముద్రణ :

**న్యూ విస్టాస్ ప్రింటర్స్, హైదరాబాదు**

ప్రతులకు :

**యువభారతి**

**5, కింగ్స్‌వే , సికిందరాబాదు-500 003**

**లేదా**

**యువభారతి కార్యాలయం**

ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు.

తిలక్ రోడ్, హైదరాబాదు-500 001

వెల : రూ. **2-00**

---

PAPER USED FOR THE PRINTING OF THESE BOOKS
WAS MADE AVAILABLE BY THE GOVERNMENT OF INDIA
AT CONCESSIONAL RATES

**YUVABHARATHI IS GRATEFUL**

---

# నన్నయ కవితా వైభవం

రమ్యమైన పద్యాలకు రుచిరవ్యాఖ్య

వ్యాఖ్యాత

**ఆచార్య దివాకర్ల వేంకటావధాని**

ప్రచురణ



రిజిష్టర్డ్ నెం. 1/64

**యువభారతి**
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు-3

NANNAYA KAVITHAVAIBHAVAM
Selections from NANNAYA'S
Poetic Work with Commenetary
By Prof. Divakarla Venkatavadhani

యువభారతి

ప్రచురణ : 44
ప్రథమ ముద్రణ : ప్రతులు 3,200
15 జనవరి, 1976
ముఖచిత్ర రచన :
శీలా వీర్రాజు
ముద్రణ :
జ్యోతి ప్రెస్, ముషీరాబాదు, హైదరాబాదు
ముఖచిత్ర ముద్రణ ;
న్యూ విస్టాన్ ప్రింటర్స్, హైదరాబాదు
ప్రతులకు :

యువభారతి

5, కింగ్స్‌వే, సికిందరాబాదు-500 003
లేదా
యువభారతి కార్యాలయం
ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు.
తిలక్ రోడ్, హైదరాబాదు-500 001
వెల : రూ. 2-00

PAPER USED FOR THE PRINTING OF THESE BOOKS
WAS MADE AVAILABLE BY THE GOVERNMENT OF INDIA
AT CONCESSIONAL RATES
YUVABHARATHI IS GRATEFUL



# మా మాట

గాసట బీసటగా జనవ్యవహారంలో ఉన్న భాషను ప్రమాణీకరించి, సున్నితమైన భావాలనూ, ఉన్నతమైన భావాలనూ ప్రకటించడానికి అనుకూలంగా తీర్చిదిద్ది, కావ్యరచనకు యోగ్యంగా సమలంకరించి, నన్నయభట్టు ఆదికవిగా తెలుగుజాతికి ప్రాతస్మరణీయుడైనాడు. వేదాలనూ, పురాణాలనూ, శాస్త్రాలనూ, అందులో ఉండే విజ్ఞానాన్ని అవగతం చేసుకుని తన సమకాలీన ప్రజలకు అందివ్వాలనుకున్నాడు. కథల రూపంలో అందివ్వాలనుకున్నాడు. మహాభారతం తన ఆశయానికి సరితూగింది. సంస్కృతంలో ఉన్న భారతాన్ని ఉన్నది ఉన్నట్లుగా కాకుండా అందులోని అర్థంబోధ పరచాలని అనుకున్నాడు. అంతేకాని అనువాదానికి పూనుకోలేదు. ఆ కాలంలో తెలుగులో కావ్యం వ్రాయడం అంటే పండితులకు ఇష్టంలేనిపని చేయడం. నన్నయ తెలుగులో కావ్యంవ్రాసి కొత్తపుంతను తొక్కి ప్రజలభాషకు పట్టంకట్టి, ప్రజాబాహుళ్యానికి కవిత్వం ఉపయోగ పడాలనే సిద్ధాంతానికి ఆనాడే అంకురార్పణ చేశాడు. పెద్దపెద్ద సమాసాలకూ, కొరకరానికొయ్యలవంటి శబ్దాలకూ, అశ్లీలమైన వర్ణనలకూ, అన్వయకాఠిన్యంతో కటకట పట్టే పద్యాలకూ తనకావ్యంలో చోటు లేకుండ చేశాడు. తెలుగునూ, సంస్కృతాన్నీ అందంగా మలచి చక్కని కావ్యం అందించాడు. నన్నయకావ్యం చదవడం అంటే సరళమైన కవిత్వాన్ని ఆస్వాదించడమే!

నన్నయకు పూర్వం తెలుగు ఎలా ఉండేదో, నన్నయ దాన్ని ఎట్లా తీర్చిదిద్దాడో, అతని కవిత్వం ఎంతగొప్పదో, గొప్పపరిశోధనచేసి తెలుగులోకానికి అందజేసిన విద్వత్కవులు ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారు. జలదస్వనగంభీరమధురమైన తమ వాగామృతధారలతో యావదాంధ్రదేశాన్ని పునీతం చేసిన వాగ్మివతంసులు. అష్టావధానం చేస్తున్న అన్వర్థ నామధేయులు. సంస్కృత భాషాభినివేశం, ఆంగ్లభాషాసంపర్కం, ప్రాచ్యపాశ్చాత్య సాహిత్య సిద్ధాంతపరిజ్ఞానం శ్రీ అవధాని గారిని ఆదర్శాచార్యులను చేసింది. ఎందరో తెలుగు గురువులకు ఆయన గురువులు.

శ్రీ అవధానిగారి ఆశీరమృత ప్రభావంతో మా యువభారతి ఇతోధికమైన భాషాసేవ చేయగలుగుతున్నది. మా యువభారతికి ఆచార్యులవారు గౌరవ సభ్యులు. అది మాకు గర్వకారణం. అదే మాకు శ్రీరామరక్ష. నన్నయ పద్యాలకు సరళమైన వ్యాఖ్యానం వ్రాసి ఇచ్చి యువభారతి నాశీర్వదించిన శ్రీ అవధాని గారికి మా భక్తి పూర్వకాభివాదములు.

15-1-76

ఇరివెంటి కృష్ణమూర్తి

అధ్యక్షుడు



# యువభారతి పరిచయం

మనిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా ఉన్న ప్రతిభాపరిమాణాలు పరివ్యాప్తం కాగలిగినప్పుడే అతని సృజనాత్మక శక్తికి సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం పెంపొందడానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం కలుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్యభావాలు కుదురుకుంటాయి.

యువభారతి గడచిన పన్నెండేళ్ళుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యం కంటే ఇతరమైన సాత్త్విక సాధనం లేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలను రూపొందించి కృషి చేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు వీలైనంత ఎక్కువ మందికి ఉత్తమ సాహిత్యాన్ని అందిస్తే సాహిత్యంపట్ల ప్రజానీకానికి అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టింది. ఇంతవరకు 43 ప్రచురణలను ప్రచురించి రెండు లక్షల యాభైవేలకు పైగా ప్రతులను సాధ్యమైనంత తక్కువ వెలకు పాఠకులకు అందించడానికి పూనుకొంది.

యువభారతి సాహితీమిత్ర పథకంలో దాదాపు 3,500 మందికి పైగా సాహితీ మిత్రులు చేరారు. రానున్న ఉగాది నాటికి ఈ సంఖ్య 10 వేలకు చేరుకోవాలన్న మా లక్ష్య సాధనలో తోడ్పడండి. యువభారతి శాశ్వత జీవిత సభ్యత్వ పథకాలలో ఐదువందల మందికి పైగా భారతీ మిత్రులుగా, యాభైమంది భారతీ భూషణులుగా చేరారు. ఏ ఒక్క పథకంలోనైనా సభ్యులుగాచేరి మా "నందిని" మాసపత్రికను ఉచితంగా పొందే అవకాశం కల్పించుకోవలసిందిగా సహృదయులకు విజ్ఞప్తి. "నందిని"లో యువభారతి కార్యకలాపాల వివరాలేకాకుండా సాహిత్యానికి సంబంధించిన అనేకాంశాలుంటాయి.

మా తపస్సు ఫలించి తెలుగుదేశంలో అధ్యయన శీలతా సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాం.

జనవరి 15 1976

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు




తెలుగు ఎదలో తెలుగుతనం
వెల్లువలా పారాలని
తెలుగింటిలో తెలుగుదీపం
అఖండంగా వెలగాలని
ఈ జాతి నిద్రలేచి
మహోన్నత మానవాదర్శాల వైపు
నిరంతర కృషితో
పయనం కొనసాగించాలనే ధ్యేయంతో
ఉడుతాభక్తిగా యువభారతి కృషి చేస్తున్నది
భాషాభిమానం కలగాలంటే
మాతృభాషా సాహిత్య పఠనమే
ప్రథమ కర్తవ్యం అనే భావం
బలంగా మనసులో నాటుకోవడానికి గాను
వీలైనంత ఎక్కువ మందికి వీలైనంత తక్కువ వెలకు
ఉత్తమసాహిత్యం అందించేందుకు
యువభారతి పూనుకున్నది
ప్రతి తెలుగింటిలో
కనీసం పదయినా తెలుగు పుస్తకాలు ఉండేందుకు
మనందరం ఉద్యమ వేగంతో కృషిచేద్దాం
ఆ పదిమంచి పుస్తకాలలో ఏ ఒక్కటిగానైనా
యువభారతి ప్రచురణ ఏ ఒక్కటైనా
ఉండాలనే ధ్యేయంతో కృషిచేద్దాం

# యువభారతి

సాహితీ, సాంస్కృతిక సంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు - 3

మా తెలుగు తల్లికి మల్లెపూదండ
మా కన్న తల్లికీ మంగళారతులు
కడుపులో బంగారు, కనుచూపులో కరుణ
చిరునవ్వులో సిరులు దొరలించు మాతల్లి

గలగలా గోదారి కదలి పోతుంటేను
బిరబిరా కృష్ణమ్మ పరుగులిడుతుంటేను
బంగారు పంటలే పండుతాయి
మురిపాల ముత్యాలు దొరలుతాయి

అమరావతీ నగరి అపురూప శిల్పాలు
త్యాగయ్య గొంతులో తారాడునాదాలు
తిక్కయ్య కలములో తియ్యందనాలు
నిత్యమై, నిఖిలమై నిలిచియుండే దాక

రుద్రమ్మ భుజశక్తి, మల్లమ్మ పతిభక్తి
తిమ్మరుసు ధీయుక్తి, కృష్ణరాయల కీర్తి
మా చెవుల రింగుమని మార్మ్రోగేదాక
నీ పాటలే పాడుతాం నీ ఆటలే ఆడుతాం

జై తెలుగుతల్లీ, జై తెలుగుతల్లీ.

—శంకరంబాడి సుందరాచార్య

# ఆదికవి నన్నయ

తెలుగు భాష క్రీ. శ. ప్రథమ శతాబ్దినుండియు జనవ్యవహారము నందుండె ననుట కాధారములున్నవి. తెలుగు భాషలో మొదటి శాసనము క్రీ.శ. 575 లో వ్రాయింపబడినట్లు తెలియుచున్నది. తరువాత తెలుగులో గద్యపద్యమయములైన శాసనములు పెక్కువెలసినవి. పండరంగుని అద్దంకి శాసనము (848) తెలుగునందలి మొదటి పద్యశాసనము. అది తరువోజలో నున్నది. తరువాతి పద్యశాసనములలో కూడ సీసము, మధ్యాక్కర, గీతము మొదలైన దేశిమార్గమునకు చెందిన పద్యములే యున్నవికాని మార్గపద్ధతికి చెందిన చంపకమాలా శార్దూలాది వృత్తములు కానరావు. క్రీ.శ. 11వ శతాబ్దికి పూర్వమే కొందఱు మహాకవులు ప్రౌఢములైన కావ్యములుకూడ వ్రాసినట్లు విమర్శకులు చెప్పుచున్నారుకాని అవియే వియు నిప్పుడు లభించుటలేదు. కాగా నన్నయ రచించిన భారత భాగమే తెలుగున సలక్షణమైన భాషతోడను, ఉదాత్తమైన యితివృత్తముతోడను, సంస్కృతమునుండి గ్రహించిన వృత్తములతోడను కూడిన మొదటి మహా కావ్యముగా పరిగణింపఁబడు చున్నది. అందుచేతనే నన్నయకు ఆదికవి అను బిరుదు కలిగినది.

నన్నయ తూర్పుచాళుక్య వంశమునకు చెందిన రాజరాజ నరేంద్రుని యాస్థానమున కవియు, అతనికి కులబ్రాహ్మణుడును, మిత్రుడునై యుండెను. వారిరువురును కొంచెమించుగా సమవయస్కులై యుందురు (990-1063). రాజరాజనరేంద్రుడు వ్యాసుని సంస్కృత భారతమునందు బద్ధమై నిరూపితమైన అర్థమేర్పడునట్లుగా దానిని తెనుగున రచింపుమని నన్నయను కోరెను. మహాభారతమువంటి యుద్గ్రంథమును రచించుటకు తగిన పదసంపదకాని ఛందోవిస్తృతికాని యప్పటికి తెలుగున లేకపోవుటచే

నన్నయ సంస్కృత పదములను తెలుగున వాడుకొనుటకు తగిన ప్రణాళిక యేర్పరచుకొని, శాసనములందును జనవ్యవహారమందును ద్వైవిధ్యము వహించియున్న పదముల స్వరూపమును స్థిరీకరించి, సంస్కృతమునుండి ధారాళమైన గమనముగల వృత్తములను గ్రహించి తెలుగున భారతము వ్రాయుటకు మొదలు పెట్టెను. అతడు వ్యాసభారతమును జదివి యంద నవసరములని తోచిన భాగములను సంక్షేపించి, అవసరమని తోచినచోట్ల నుచితవర్ణనాదులచే పెంచి, అనుచితములని తోచిన భాగముల నన్యథాకరించి అనువాదమయ్యు స్వతంత్ర రచనవలె భాసించునట్లు ఆది సభా పర్వములను, అరణ్య పర్వమునందలి చతుర్థాశ్వాసమున 142 పద్యములను రచించి దివంగతుడయ్యెను. తరువాత తిక్కన సోమయాజి నాల్గవదియైన విరాటపర్వము మొదలు తుదివఱకు పదునైదు పర్వములను రచించెను. పిమ్మట ఎఱ్ఱాప్రెగ్గడ నన్నయ వ్రాయగా మిగిలిన అరణ్య పర్వశేషము నతని పేరుమీదుగనే పూరించెను. తిక్కన యెఱ్ఱనలుకూడ ననువాద విషయమున నన్నయనే యొజ్జబంతిగా గ్రహించిరి. నన్నయ కాదికవి యనియేకాక వాగనుశాసనుడను బిరుదుకూడఁ గలదు. అతడు తనకు సహాధ్యాయుడైన నారాయణభట్టు తోడ్పడెననియు, తన కవిత్వమున ప్రసన్నకథాకలితార్థయుక్తి, అక్షరరమ్యత, నానారుచిరార్థసూక్తి నిధిత్వము అను గుణములుండు ననియు చెప్పియుండెను. అతని రచన సంస్కృతపద ప్రచురమయ్యు నక్లిష్టమై, ధారాశుద్ధిశోభితమై మనోహర ముగా నుండును. అతడు తెలుగున ప్రౌఢమైన పద్యరచనకువలెనే గద్య రచనకును ఆద్యుడు.

—దివాకర్ల వేంకటావధాని.

# నన్నయ కవితా వైభవం

1. శ్రీవాణీ గిరిజాశ్చిరాయ దధతో వక్షోముఖాంగేషు యే
లోకానాం స్థితి మావహ న్త్యవిహతాం స్త్రీపుంసయోగోద్భవాం
తే వేదత్రయ మూర్తయ స్త్రిపురుషాస్సంపూజితావస్సురైః
భూయాసుః పురుషోత్తమాంబుజభవ శ్రీకంధరా శ్శ్రేయసే.
(ఆది. 1-1)

ఇది నన్నయ మహాభారతారంభమున రచించిన మంగళాచరణ శ్లోకము, తాను తెలుగుననే కావ్యము వ్రాయబోవుచున్నను అతడీ యారంభ మంగళశ్లోకమును సంస్కృతమున రచించెను. సంస్కృతము దేవభాష. ఆశీర్వచనాదులు వేద మంత్ర రూపముననో సంస్కృతముననో యుండుట యుచితమని యిప్పటికి కూడ భారతీయులు భావించుచుందురు. నన్నయ నాడీ యభిప్రాయము మరింత ప్రబలమై యుండుననుటలో సందేహము లేదు. అందుచే శ్రేయస్సు నాకాంక్షించు నీ ఆరంభ పద్యమును నన్నయ సంస్కృతమున రచించెను. 'మంగళా దీని మంగళ మధ్యాని మంగళాంతాని కావ్యాని' అను సూక్తి ననుసరించి యతడీ శ్లోకమును శ్రీకారముతో మొదలుపెట్టెను.

లక్ష్మి సరస్వతీ పార్వతులను క్రమముగా ఱొమ్మునను, ముఖమునందును అర్ధ దేహమునందును ధరించి యెవరు స్త్రీ పురుష సంయోగ సంజాతమైన లోకముల స్థితి నవిచ్ఛిన్నముగా కొనసాగించుచున్నారో వేదత్రయ రూపులును, సురపూజితులును అగు విష్ణువు, బ్రహ్మ, శంకరుడు అను నా త్రిమూర్తులు మీకు శ్రేయస్సు కలిగింతురు గాక యని యిందలి భావము.

ఇది సంస్కృత నాటకములందలి నాందీ శ్లోకమును బోలియున్నది. దీనిని నన్నయ రాజరాజనరేంద్రునిచే ననిపించెను. భారతాంధ్రీకరణ నాటకమునకు సూత్రధారు డతడే కదా !

శ్రీ కంధరుఁడనగా విషము కంఠమునఁ గలవాఁడు, శివుఁడు అని యర్థము మంగళ శ్లోకమున విషకంఠుడను శబ్దమును ప్రయోగించుటేల యని కొందఱు శంకింతురు. శ్రీ యనగా విషమేయైనను-శివుడు హాలాహల భక్షణ మొనరించుట సర్వలోక రక్షణము కొఱకే-అందుచేనది లోక శ్రేయమునే సూచించును.

నన్నయ ఋషి ప్రాయుఁడైన మహాకవి. "నానృషిః కురుతే కావ్య" మ్మను సూక్తి తెలుఁగు కవులలో నతనికి పూర్తిగా నన్వయించును. భవభూతి యన్నట్లు ఋషుల వాక్యముల నర్థ మనుసరించును, అతడీ శ్లోకమున లోకస్థితిని త్రిమూర్తులా వహింతురని చెప్పియుండెను. అది ఆంధ్రమహా భారతమను వాఙ్మయ ప్రపంచము స్థితిని నన్నయ, తిక్కన, ఎఱ్ఱన అను త్రిమూర్తులు (కవిత్రయమువారు) నిర్వహింతురని ఆరంభమునందే సూచించుచున్నది. పురుషోత్తముడు నారాయణుడు. నారాయణ శబ్ద భవము నన్నయ. అంబుజ భవుడు బ్రహ్మ. తిక్కన కవిబ్రహ్మ. శ్రీ కంధరుడు శివుడు. ఎఱ్ఱన శంభుదాసుడు. ఋషియైన నన్నయ వాక్కు ననుసరించి ఆంధ్ర మహా భారతమును కవిత్రయ త్రిమూర్తులు నిర్వహించుట జరిగినది.

మంగళ శ్లోకమున ఆశీర్నమస్క్రియా వస్తు నిర్దేశములలో నొకటి యుండ వలెనని లాక్షణికులు చెప్పుదురు. ఇం దాశీర్వాదమున్నది. వేద శబ్దముచే పంచమ వేదమును, పురుషోత్తమ శబ్దముచే శ్రీ కృష్ణ పాండవులును, శ్రీ కంధర శబ్దముచే దుర్యోధనాదులును సూచింపఁ బడుచున్నారు.

వక్షోముఖాంగేషు అనుద్వంద్వము నందలి వక్షోముఖాంగములు శరీరావయవములగుటచే నది పాణిని సూత్రము ననుసరించి యేకవచనాంతమై యుండవలెనని కొంద ఱందురు, కాని యిందలి వక్షోముఖాంగము లేక శరీరమునకు సంబంధించినవి కావు. వక్షము విష్ణువునకును, ముఖము బ్రహ్మకును, అంగము శివునికిని సంబంధించి నవి. అందుచే నా సమాసము బహువచనాంతమై యుండుట దోషము కాదని సమాధానము చెప్పుకొనవచ్చును.

2. సారమతిం గవీంద్రులు ప్రసన్నకథా కవితార్థయుక్తి లో
నారసి మేలునా నితరు లక్షరరమ్యత నాదరింప నా
నారుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారత సంహితారచన బంధురుఁడయ్యె జగద్ధితంబుగన్.
(ఆది. 1-26)

ఈ పద్యమున నన్నయ కవిత్వము నందలి ప్రముఖ గుణములు పేర్కొనఁ బడినవి. ఇది భారతావతారిక యందలి తుది పద్యము. ఈ అవతారిక యంతయు ప్రథమ పురుషము నందున్నది. ఇందు స్వవిషయము కొంత చెప్పవలసి వచ్చుటచే ఆత్మశ్లాఘగా తోపకుండుటకై నన్నయ దీనినిట్లు ప్రథమ పురుషమున చెప్పియుండును కవిపుంగవులు నిశితమైన బుద్ధితో ప్రసాదగుణయుక్తములైన కథల యందున్న అర్థము తోడికూడికను లోపల గమనించి మేలని ప్రశంసింప, నన్యులు అక్షరము లందలి రామణీయకమును మెచ్చుకొనగా, హృద్యమైన అర్థముతోగూడిన సూక్తులకు నిధానమైన నన్నయభట్టు లోకమునకు శ్రేయ మావహిల్లి తెలుగున మహాభారతమను పంచమవేదమును రచించెను.

సంహిత వేదమునందు ప్రధానమైన మంత్ర భాగము. భారతమునకు పంచమ వేదమను ప్రథయుండుటచే దానిని నన్నయ సంహిత యని పేర్కొనెను, కవీంద్రులు నన్నయ భారతమును జదివి యందలి ప్రసన్నములైన కథలందున్న అర్థగాంభీర్యమును బాగుగా పరిశీలించి మెచ్చుకొందురు. ఇతరు లంతర్గతమైన అర్థ సౌందర్యమును గమనింప లేక పోయినను పదముల కూర్పునందలి రామణీయకముచే నాహరింపబడి తృప్తి నొందుదురు. దీనికంత నిశిత పరిశీలన మవసరము లేదు. ఈ రెండు గుణములలో మొదటిది అర్థమునకును రెండవది శబ్దమునకును సంబంధించినవి నన్నయ కథాకథనమున మేటి. మూలమునందలి పునరుక్తులను, అనవసర విషయ వివరణమును తగ్గించి. రసపోషణమునకనువగు వర్ణనలు చొప్పించి, పూర్వాపర సంబంధ మేర్పడునట్లు కథలను రచించి నన్నయ వానికి ప్రసన్నత కలిగించెను. ప్రసాదము సర్వరస సమర్పకమైన గుణము. అందుచే నిందలి ప్రసన్న పద ప్రయోగముచే రస సమంచితత్వమును సూచితమగుచున్నది. అక్షరరమ్యత యనగా సర్వత్ర మృదువులైన పదములనే వాడుటకాదు. రసోచితముగా పదములను ప్రయోగించుట. అచ్చటి పదములను విన్నంతనే ఆ సందర్భమందలి రసముకూడ స్ఫురించును. ఇది రీతికి ప్రాణము, నన్నయ తన రచనలో ప్రత్యేక పద్యముల రూపముననను, అర్థాంతర న్యాసరూపముననను పెక్కు సుభాషితములను చేర్చియుండును. జాతీయములను, లోకోక్తులను, అర్థగంభీరములగు పదములనుకూడ సూక్తులన వచ్చును. ఇట్టి సూక్తులకు నన్నయ మున్నీరు. ప్రసన్న కథాకలితార్థయుక్తి అను సమాసమునందలి కవిత అను పదమునకు కవితా అను పాఠాంతరమున్నది, అప్పుడు ప్రసన్న శబ్దము కథా, కవితార్థములు మూడింటికిని విశేషణముగా గ్రహింప

వచ్చును, నన్నయ రచనలో కథలును, కవితయు, అర్థమును ప్రసాదగుణ భాసురములై యుండును. కొందరు కథాకవితా పదములను రెంటిని కలిపి ప్రసన్నమైన కథా కవిత్వముతోడను అర్థముతోడను కూడిక అని అర్థము చెప్పుదురు. కథా కవిత్వమన Narrative poetry. నన్నయకు పూర్వము శాసనాదులందు కొంత కవిత్వమున్నను కథా కవిత్వమునకు శ్రీకారము చుట్టిన వాడతడే అని వారి భావము.

3. సాత్యవతేయ విష్ణుపద సంభవమై విబుధేశ్వరాబ్ధి సం
గత్యుపశోభితమ్మయి జగద్విదితంబగు భారతీయ భా
రత్యమరాపగౌఘము నిరంతర సంతత పుణ్యసంపదు
న్నత్యభివృద్ధి సేయు వినినం గొనియాడిన నెల్లవారికిన్.

(ఆది. 1-72)

సౌతి శౌనకాది మహర్షులకు భారత శ్రవణ స్తవన ఫలితము నిట్లు చెప్పెను. వ్యాసుడను నాకసమునందు పుట్టి పండితశ్రేష్ఠులను సముద్రమునఁ గలయుటచే ప్రకాశించుచు సర్వలోక ప్రసిద్ధమగు భారతమునకు సంబంధించిన వాక్కనెడి దివ్యగంగాప్రవాహము విన్నను గొనియాడినను ఎల్లవారికిని అవిచ్ఛిన్నమును శాశ్వతమును అయిన పుణ్య సంపదయొక్క అభివృద్ధిని కలిగించును. నన్నయ యిట్టి రూపకములను పలుచోట్ల వాడుచుండును. భారతభారతి దివ్యగంగా ప్రవాహమువలె విశేష పుణ్య ప్రదమవి భావము

4. నిండుమనంబు నవ్యనవనీతసమానము, పల్కు దారుణా
ఖండల శస్త్ర తుల్యము జగన్నుత! విప్రులయందు నిక్కమీ
రెండును రాజులందు విపరీతము గావున విప్రుఁ డోపు నో
పం డతిశాంతుఁ డయ్యు నరపాలుఁడు శాపము గ్రమ్మఱింపఁగన్.

(ఆది. 1-100)

ఉదంకుడు పౌష్యునింట భుజించుచు నన్నము కేశదుష్టమై యుండుటచే కలిగి యతని నంధుడ వగుమని శపించెను. పౌష్య దల్ప దోషమున శపించితివి కావున నీవనపత్యుడ వగుదువుగాక యని ప్రతిశాపమిచ్చెను. ఉదంకుడు నే ననపత్యుడను గానోపను. శాపము గ్రమ్మఱింపుమని వేడెను. అప్పుడు పౌష్య డిట్లనెను.

బ్రాహ్మణులకు మనస్సప్పుడే తీసిన వెన్నవలె మృదువుగాను, పల్కు భయంకరమైన యింద్రుని వజ్రాయుధమువలె కఠినముగాను ఉండును. ఈ రెండును అనగా మనస్సును వాక్కును రాజులకు తద్విరుద్ధముగా నుండును. అనగా మనస్సు వజ్రాయుధ కఠినముగాను వాక్కు నవనీతమృదువుగాను ఉండును. శాపము మరలించుటకు మనోమార్దవ ముండవలయును. అది రాజుల కుండదు. అందుచే విప్రునివలె శాంతుడయ్యును క్షత్రియు డిచ్చిన శాపమును మరలింప జాలడు. ఈ పద్యము తఱుచుగా నుద్ధరింపఁ బడుచు బహుళ ప్రచారమున నున్న నన్నయ పద్యరత్నములలో నొకటి. నకార పునరావృత్తిచే మార్దవమును ఖ, స్త్ర వర్ణములచే కాఠిన్యమును తోపఁజేయుచు నీ పద్య మర్థానుగుణమైన పదప్రయోగముతోఁ గూడి ధారాశుద్ధి శోభితమై బ్రాహ్మణ క్షత్రియుల మనఃప్రవృత్తులను చక్కగా వ్యక్తము చేయుచున్నది.

5. బహువనపాద పాబ్ధికుల పర్వత పూర్ణ సరస్సరస్వతీ
సహిత మహా మహీధర మజస్ర సహస్రఫణాళిఁ దాల్చి దు
స్సహతర మూర్తికిన్ జలధిశాయికిఁ జాయక శయ్యయైన య
య్యహిపతి దుష్కృతాంతకుఁ డనంతుఁడు మాకుఁ బ్రసన్నుఁ
డయ్యెడున్ (ఆది. 1-104)

ఉదంకుడు నాగరాజుల స్తుతించిన సందర్భమునందలి పద్యమిది. మూలమున ననంత వానుకుల స్తోత్రము లేకపోయినను వారు నాగరాజులలో శ్రేష్ఠులగుటచే నన్నయ ఉదంకుడు కూడ స్తుతించినట్లు వ్రాసి యౌచిత్యమును పాటించెను.

అనేకములైన వనములతోడను, చెట్లతోడను, సముద్రములతోడను, కులపర్వతములతోడను నిండినదియు, సరస్సులతోడను నదులతోడను గూడినదియు (పూర్ణ అను దానిని సరస్సరస్వతులకు విశేషణముగా కూడ గ్రహింపవచ్చును. కన్నిటితోనిండిన) అగు విస్తృతమైన భూమి భారమును ఉడుగని (శాశ్వతముగా) వేయిఫణముల సమూదాయముపై ధరించి సహింపశక్యముకాని నిగ్రహముకల నారాయణునకు విడువక శయ్యయై పాపాత్ములను నాశనముచేయు నానాగరాజు అనంతుడు మమ్మనుగ్రహించుగాక. నన్నయకు పూర్వము తెలుగున శతకములులేవు. ఇచ్చటి నాలుగు స్తుతిపద్యములందును "మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్" అను సమానవాక్యము మకుటమువలె గోచరించుచు, తరువాత శరపరంపరలుగా వెలువడిన సమానమకుటపద్య శోభితములైన

శతకములకు మార్గదర్శకముగా గోచరించుచున్నది. ఇందలి ప, స, హ, ప్ర వర్ణము లకుగల వృత్త్యనుప్రాసము పద్యమున కెనలేని ధ్వనిగాంభీర్యమును కలిగించుచున్నది. నన్నయ సంహితాభ్యాసుడైన మహాకవి. అతనినోట వెలువడిన యిచ్చటి పద్యములు శ్రుతిసుభగమైన ధ్వనిగాంభీర్యమునకు నిధానములై వేదఋక్కులను వాదుకు పిల్చు చున్నట్లున్నవి. నన్నయ కవిత్వ మక్షరరమ్యతకును ధారాశుద్ధికిని పరమోదారణము. **మాకు**-అనుట యందలి బహు'వచనప్ర'యోగము గమనింపదగినది.

6. ప్రల్లదుఁడైన యొక్కఁ కులపాంసను చేసినదానఁ దత్కులం
బెల్లను దూషితంబగుట యేమి యపూర్వము, గావునన్ మహీ
వల్లభ! తక్షకాధమునెపంబున సర్పము లెల్లనగ్నిలోఁ
ద్రెళ్ళఁగ సర్పయాగ మతిధీయుత! చేయుము విప్రసమ్మతిన్.

(ఆది. 1-125)

ఉదంకుడు చాలాకాలము తపస్సుచేసి తక్షకుడు తనకొనర్చిన యపకృతికి ప్రతీ కారము చేయనెంచి జనమేజయుని కడకేగి యతని సర్పయాగాచరణమునకు ప్రేరేచిన సందర్భము నందలి పద్యమిది. కులకళంకమైన యొక దుష్టుడు చేసిన దుష్కృత్య ముచే నతని కులమంతయు మలినమగుటలో నచ్చెరువులేదు. కావున దుష్టుడైన తక్షకుడు కారణముగా నతని జాతికి చెందిన పాములెల్ల నగ్నిలో పడునట్లుగా బ్రాహ్మ ణుల యనుజ్ఞచే సర్పయాగము నొనరింపుము.

తక్షకు డొక్కడు చేసిన దుష్కృత్యముచే పాపజాతియంతయు నాశనోన్ముఖ మగుట సంభవించినది. కౌరవకుల పాంసనుడైన దుర్యోధను డొనరించిన దుష్కృత్య ములచే కౌరవకులమంతయు మహాభారత యుద్ధమున మడియుట తటస్థించెను. ఈ పద్యమున నాకావ్యార్థము చక్కగా సూచితమైనది.

7. అలఘు ఫణీంద్రలోక కుహరాంతర దీప్త మణిస్ఫురత్ప్రభా
వలి నలదాని శర్వదుదవాస మహావ్రత శీతపీడితా
చలముని సౌఖ్యహేతు విలసద్బడబాగ్ని శిఖాచయంబులన్
వెలిఁగెడిదానిఁ గాంచి రరవిందనిభానన లమ్మహోదధిన్

(ఆది. 2-28)

కద్రూవినతలు వినోదార్థము విహరింపనేగినవారు సముద్రమును గాంచిరి. ఆ సముద్రము వర్ణనమిది. గొప్ప గుహవంటి నాగలోకము (పాతాళము) నడుమ ప్రకాశించు మణుల ఉజ్జ్వలమైన కాంతుల సమూహము కలవానిని, సంతతము నీటియందు నివసించుట అను గొప్ప వ్రతమునందు చలిచే బాధపెట్టబడియు స్థిరముగానుండు (పర్వతములనెడి) మునులకు సౌఖ్యకారణమై ఒప్పుచున్న బాడబవహ్ని జ్వాలలచే ప్రకాశించుదానిని, సముద్రమును కద్రూవినతలు కాంచిరి.

నన్నయ సాధారణముగా వర్ణ్యము యొక్క ఏకైక విన్యాసమును వర్ణించుచు ప్రతివిశేషణము చివరను దాని. దాని అను సర్వనామమును చేర్చుచుండును. అతని వర్ణనలు చిత్రకారుని చిత్రలేఖనములవలె వస్తువు యొక్క ఒక స్థితిని పఠితలకు సాక్షాత్కరింపఁజేయుచుండును.

8. విద్వన్ముఖ్యుఁడు ధర్మమూర్తి త్రిజగద్విఖ్యాతతేజుండు కృ
ష్ణద్వైపాయనుఁ డేగుదెంచి సుతశిష్యబ్రహ్మ సంఘంబుతో
సద్వంద్యుండు సదస్యుఁ డయ్యె ననినన్ శక్యంబె వర్ణింప సా
క్షాద్విష్ణుండవు నీవ భూపతులలోఁ గౌరవ్య వంశాగ్రణీ.
(ఆది. 2-225)

జనమేజయుడు సర్పయాగ మొనరించుచుండ వాసుకి ప్రేరితుడై అతని మేనల్లుడును జరత్కారుసుతుడునైన ఆస్తీకుడు దాని నుడిగించుటకై యరుదెంచి జనమేజయుని స్వస్తివచన పూర్వకముగా స్తుతించిన పద్యములలో నిదియొకటి. కౌరవ్య వంశమున అగ్రేసరుడవైన ఓ జనమేజయుడా! విద్వాంసులలో శ్రేష్ఠుడు, రూపొందిన ధర్మము, ముల్లోకములయందు ప్రసిద్ధమైన తేజము కలవాడు, సజ్జనుల కారాధ్యుడునైన వ్యాసుడే స్వయముగా కొడుకు, శిష్యులు, ఋత్విజులు మున్నగువారి సముదాయముతోవచ్చి నీ యజ్ఞమున యజ్ఞవిధి పరీక్షకుడైన సదస్యుడయ్యెనన దానిని వర్ణింప శక్యమగునా ? రాజులందరిలో నీవు సాక్షాద్విష్ణుడవే.

జనమేజయుని సర్పయాగమునకు చండభార్గవుడుహోత; పింగళు డధ్వర్యుడు, శార్ఙ్గరవుడు బ్రహ్మ; కౌత్సు డుద్గాత; వ్యాసుడు అతని శిష్యులు వైశంపాయనపైల జైమిని సుమంతులు, కుమారుడు శకుడు, శ్వేతకేతు మౌద్గల్యాదులు సదస్యులు. ఈ ఘట్టమునందలి పద్యములు ధారాశుద్ధికి నిలయములై ఆస్తీకుడు పద్యోపన్యాసమిచ్చు

చున్నాడా అను తలంపు కలిగించుచుండును. ద్వ్యక్షరప్రాసముతోకూడిన పద్యము కూడ నన్నయచేత ధారాళమై యెట్టి ఆటంకమునులేక సరళముగా సాగిపోయినది. తిక్కన విరాటపర్వారంభమున వ్రాసిన "విద్వత్సం స్తవనీయభవ్య కవితావేశుండు" అను పద్యముపై ఈ పద్యము ప్రభావము కనిపించును.

9. ఆయుష్యం బితిహాసవస్తుసముదాయం బైహికాముష్మిక
శ్రేయఃప్రాప్తి నిమిత్త ముత్తమసభాసేవ్యంబు లోకాగమ
న్యాయైకాంతగృహంబు నాఁబరఁగి నానావేదవేదాంత వి
ద్యాయుక్తంబగుదానిఁ జెప్పఁదొడఁగెం దద్భారతాఖ్యానమున్
(ఆది. 3-11)

సర్పయాగము నుపసంహరించిన పిమ్మట జనమేజయుడు వ్యాసుని పాండవ ధార్తరాష్ట్ర విభేదన కారణము తెలుపుమని యడుగ వ్యాసుడు శిష్యుడైన వైశంపాయను నతనికి భారతాఖ్యానమంతయు చెప్ప నియోగించెను. వైశంపాయనుడు దానిని చెప్ప నుపక్రమించుచు తద్గుణముల నిట్లు వర్ణించెను. ఆయుర్దాయమును పెంపొందించునది, ఇతిహాస వస్తుసమూహముతో కూడినది. ఇహపరములందు మేలుపొందుటకు కారణమైనపి, ఉత్తమ సభల యందారాధ్యము, లౌకికములైన శాస్త్రములకును నీతిన్యాయములకును రహస్యగృహము అనగా నొప్పి సర్వవేదోపనిషద్విద్యల కాటపట్టైన మహాభారత కథను వైశంపాయనుడు చెప్పనారంభించెను. "ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబనిః" ఇత్యాది సీసపద్యమున (ఆది. 1-32) నన్నయ వ్యాసుడు మహాభారతమును ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రమనియు, తత్త్వవిదుల వేదాంతమనియు, నీతివిచక్షణులు నీతిశాస్త్రమనియు, కవివృషభులు మహాకావ్యమనియు, లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహమనియు, నైతిహాసికు లితిహాసమనియు, పౌరాణికులు బహుపురాణసముచ్చయమనియు కొనియాడుచుండ విశ్వజనీనమౌనట్లు మహాభారత మొక విశ్వవిజ్ఞానకోశమని చెప్ప దగినది. "యదిహాస్తితదన్యత్ర యన్నేహాస్తి నతత్క్వచిత్"ను మాట అన్వర్థము. దానిని చదువుటవలనఁ గలుగు ఫల మనంతము. ఆ విషయమే నన్నయ యీ పద్యమున మరల వివరించినాడు. నన్నయ నాడు రాజుల కొలువులలో పండిత సంఘములుండి కవులు రచించు కావ్యముల గుణాగుణవిమర్శ చేయుచుండెడివి. అందుచేతనే అతడు కావ్యారంభమున 'సత్సభాంతర సరసీ వనంబులను' కొనియాడియుండెను.

తరువాత పర్వానుక్రమణికయందును సభలమాట పదేపదే ఉగ్గడించెను. ఉత్తమసభా సేవ్యమను విశేషణముకూడ అట్టి సభలుండెననియు నందు మహాభారత మారాధింపం బడుచుండెననియు తెల్పుచున్నది.

10. వాఁడి మయూఖముల్ గలుగువాఁ డపరాంబుధిఁ గ్రుంకె ధేనువుల్
నేఁడిటవచ్చె నేకతమ నిష్ఠమెయిన్ భవదగ్నిహోత్రముల్
పోఁడిగ వేల్వఁగాఁబడియె బ్రొద్దును బోయెఁ, గచుండు నేనియున్
రాఁడు వనంబులోన మృగరాక్షసపన్నగ బాధనొందెనో.

(ఆది. 3-112)

బృహస్పతి కుమారుడైన కచుడు శుక్రునకు సేవచేయుచు నతనికడ విద్యాభ్యాస మొనరించుచుండ రాక్షసు లది సహింపక బృహస్పతి తోడియలుక నొకనాఁ డా కచుని చంపి విశాలసాలస్కంధమున కట్టి యేగిరి. సూర్యు డస్తమించెను. హోమధేనువు వింటికివచ్చెను. కచుడు రాలేదు. అప్పుడు దేవయాని దుఃఖితయై తండ్రియైన శుక్రుని కడకరిగి యిట్లు చెప్పెను.

సూర్యుడు పడమటి సముద్రమునఁ గ్రుంకెను. (అస్తమించెను) హోమధేనువులు కచుడు లేకుండ నొంటరిగా వచ్చినవి. సాయంకాలమగుటచే అగ్నిహోత్రములందు హోమకార్యములు చేయఁబడినవి. చాల ప్రొద్దు పోయినది. కచుని జాడయే కానరాకున్నది. అడవిలో అతడు క్రూరమృగముల వలనకాని, రాక్షసుల వలనకాని, పాముల వలనకాని బాధపొందెనో ఏమో. ఈ పద్యము చిన్నచిన్న వాక్యములతోకూడి దేవయాని మనమునందలి ఆత్రమును సూచించుచున్నది. సూర్యాస్తమయ సమయమున ఆశ్రమములందు కనవచ్చు ముఖ్యదృశ్యము లిందు వర్ణింపఁబడినవి. నన్నయ సంస్కృత పదములనువలెనే తెలుగుపదములను కూడ నెంత మెలకువతో వాడునో యీ పద్యమును బట్టి గ్రహింపవచ్చును. నన్నయ రెండుమూడు చోట్ల నకారాదియైన 'నేని' అను నవ్యయమునుకూడ వాడియుండెను. నేని అనగా ఏ మాత్రమును అని అర్థము.

11. జలధివిలోల వీచి విలసత్కలకాంచి సమంచితావనీ
తలవహనక్షమంబయిన దక్షిణహస్తమునం దదున్నమ
ద్గళదురు ఘర్మవారి కణక్రమ కరాబ్జమువట్టి నూతిలో
వెలువడఁ గోమలిం దిగిచె విశ్రుతకీర్తియయాతి ప్రీతితోన్.

(ఆది. 3-144)

శర్మిష్ఠ దేవయాని నొక్క నూతిలోఁ ద్రోచి వెడలిపోయెను. వేటకు వచ్చిన యయాతి జలాపేక్షచే నా నూతికడుకు వచ్చి యందున్న దేవయానిని జూచి "నీ వెవ్వరి దానవు. ఇట్లు నూతఁ బడియుండుటకుఁ గారణమే" మనియడిగెను. దేవయాని తనయుదంతము తెలిపి "ప్రమాదవశమున నీ నూతిలోఁబడి వెల్వడఁజాల కున్నాను. నన్నుద్ధరించి రక్షింపు"మని వేడుకొనెను. ఈ సందర్భమున నన్నయ వ్రాసిన పద్యమిది.

ప్రసిద్ధుఁడైన యయాతి సముద్రమునందలి చలించు కెరటములనెడి, ప్రకాశించుచు ధ్వనిచేయు, మొలనూలితో చుట్టఁబడిన భూతములను భరించుటకు సమర్థమైన తన కుడిచేతితో దేవయాని పైకెత్తిన జారుచున్న చెమట బిందువులతో నందమైన, హస్త పద్మమును బట్టుకొని ప్రీతితో నామెను నూతి నుండి బయటికి తీసెను. భూమికి సముద్రము ఒడ్డాణమువలె నుండునని వర్ణించుట కవి సమయము. ఇచటి సమాసము ధారా శుద్ధితోఁగూడిన నన్నయ సమాసఘటనమునకు నిదర్శనము. దేవయాని చేయి చెమట బిందువులతోఁగూడి యుండుట యామె కతనిపై ప్రేమగల్గినదని సూచించు చున్నది. స్వేదము శృంగార రస సాత్త్వికభావము. ఈ సాత్త్విక భావము మూలమునఁగానరాదు. "నూతిలో వెలువడు" ననఁగా నూతి నుండి బయటికి వచ్చు నట్లని యర్థము.

12. అసదృశయౌవనంబది యనన్యధనంబగు నొక్కొ నాకు ని
క్కుసుమ సముద్రమంబును నగోచరదుర్గమదుర్గవల్లరీ
కుసుమ సముద్గమంబగునొకో పతిలాభములేమిఁజేసి, యొ
ప్పెసఁగఁగ దేవయాని పతినేమి తపం బొనరించి కాంచెనో.
(ఆది. 3-170)

వృషపర్వుఁడు శర్మిష్ఠను దేవయానికి. దాసిగాఁ జేయుట కంగీకరించెను. దేవయాని యయాతిని పెండ్లి యాడిన పిమ్మట శర్మిష్ఠయు కన్యకా సహస్రమును తోడరా యయాతి నగరమున కరుదెంచెను. శుక్రుఁడు దేవయానిని పంపునపుడు యయాతికి శర్మిష్ఠ విషయమునుజెప్పి "దీని నన్నపానాదులచే సంతోషింప ఁజేయుము. శయన విషయమున పరిహరింపు"మని పలికెను. యయాతి దేవయానితో సుఖము లను భవించుచు నిరువురు కొడుకులను గనెను. అపుడు సంప్రాప్త యౌవనయు, ఋతుమతియునైన శర్మిష్ఠ యాత్మగతంబున నిట్లు తలంచెను.

"ఋతు కాలశ్చ సంప్రాప్తోనచమేఽ స్తిపతి ర్వృతః" అను మూలమునందలి శ్లోకార్థమునకు నన్నయ గావించిన పెంపకమిది. "సాటిలేని యీ యౌవన మన్యుల ధనముగాకుండ వ్యర్థమగు నా యేమిః నాకు ప్రాప్తించిన యీ ఋతు కాలము పతి లాభము లేక పోవుటచే దూరస్థితమై వెళ్ళ శక్యముగాని దుర్గమునందలి లత యొక్క కుసుమ సముద్గమము వలెనే పరానుప భోగ్యమగునా యేమిః దేవయాని యేమి తపం బాచరించి తగిన పతిని "బొందెనో కదా!" సంప్రాప్త యౌవనలై పతి లాభము లేని కన్యల మనస్సులందుదయించు శృంగార భావమిచ్చట చక్కఁగా వర్ణింపఁబడినది. శర్మిష్ఠకుసుమ సముద్గమము. నగోచర దుర్గమదుర్గవల్లరీ కుసుమ సముద్గ మముతోఁ బోల్చుట పరమౌచిత్య శోభితమై యున్నది. దీనిబట్టి శర్మిష్ఠ యుంచఁ బడినచోటు కూడన గోచరము పై యుండెనని ధ్వనించుచున్నది. అనన్య ధనమను సమాస మితరు లుపభోగించుట. కనర్హమై వ్యర్థమగు చున్నదని భావమును సూచించు చున్నది. దేవయాని పతి లాభముగాంచి సుఖము లనుభవించు చుండెను. తాను రాజకుమారి యయ్యు పతిలాభము లేక యుండుట శర్మిష్ఠకు దుఃఖముతోపాటు కొంత యసూయను గూడ గల్గించి యుండును.

13. నరలుగల కాముసైనను దరుణులు రోయుదురు డాయధనపతి యైనన్
బురుషుఁడు దుర్వారజరా పరిభూతి నభీష్టభోగబాహ్యుఁడగాఁడే.
(ఆది. 3-194)

యయాతి శుక్ర శాపవశమున వృద్ధుఁడై కొడుకులను రావించి వారిలో నొక్కడుఁ తన ముదిమిఁగైకొని యౌవనమును దనకీయ వలెనని కోరెను. అప్పుడు వారతనితో నిట్లనిరి.

"నరసిన వెండ్రుకలు గల మన్మథునైనను జవ్వనులు సమీపించుట కహస్య పడుదురు. కుబేరుఁడయ్యును పురుషుఁడు వారింపశక్యముగాని ముదిమి వలని పరా భవముచే కోరిన భోగముల ననుభవింపలేని వాఁడు కాఁడా !" ఇది లోక సామాన్య మైన భావము. నన్నయ యిట్టి సర్వసాధారణ భావములతోఁ గూడిన పద్యముల నాయా సందర్భముల వ్రాయు చుండును. యయాతి కథలోనే కాక యిట్టి సందర్భము లందెల్ల చోట్ల నీపద్యము నుద్ధరింప వచ్చును. సాధారణముగా నన్నయ యిట్టి పద్య ములను కథా సందర్భ సంబద్ధములుఁ గావింపక యెప్పుడైన నాడుకొనుటకు తగినట్లు

విడివిడిగా వ్రాయుచుండును, ఇచ్చట మన్మథుఁడనక కాముఁడనుటయు, స్త్రీలనక తరుణులనుటయు. కుబేరు డనక ధనపతియనుటయు నన్నయ సాభిప్రాయ పద ప్రయోగమునకు తార్కాణము.

14. మనమునకుఁ బ్రియంబునుహిత, మునుబథ్యముఁ దథ్యమును,
నమోఘము మధురం
బును బరిమితమును నగుపలు కొనరఁగఁ బలుకునది ధర్మ
యుతముఁగ సభలన్.
(ఆది. 3-205)

యయాతి పూరునకు బోధించిన నీతులలో నిది యొకటి. మనస్సునకు, ప్రీతికరమును, రుచికరమును, మేలు చేయునదియును, సత్యమును వ్యర్థముగా నిదియు. తియ్య నిదియు, నవిస్తృతమునునగు పలుకు ధర్మయుక్తముగా సభలలో నొప్పు మీరఁ బలుకవలయును.

నన్నయకు మితహిత సత్య వాక్యములన్న చాల నిష్టము. అతడు జనమే జయున కొక్కచో "మితహిత సత్యవాక్య జనమేజయః" యను సంబోధనమును వాడి యుండెను. సభలలో నెట్టి పల్కులు పలుక వలెనో యీ పద్యము చెప్పు చున్నది. హిత పథ్య పదములు రెండును సమానార్థకములుగానే గన్పించును. కాని కొంచెము భేదమున్నది. హితమైనది విను నప్పుడా నందమును గల్గించి తరువాత మేలు చేయును. పథ్యమైనది విను నప్పుడిష్టముగా నుండకపోయినను రోగికి పథ్యము వలె తరువాత మేలు చేయును. ఈ పద్యము నడక చాలా నెమ్మదిగా నున్నది. సభలలోఁ బలుకునప్పుడుగూడ తొందరపాటు లేక ప్రశాంతముగాఁ బలుకవలయునని యిది చెప్పక చెప్పుచున్నది.

15. శ్రవణసుఖంబుగా సామగానంబులు
చదివెడు శుకముల చదువుదగిలి
కదలక వినుచున్న కరులయుఁ గరికర
శీతలచ్ఛాయఁ దచ్ఛికరాంబు
కణములఁ జల్లని గాడ్పానపడి వానిఁ
జెంది సుఖంబున్న సింహములయు,

భూసుర ప్రవరులు భూతబలుల్ దెచ్చి
పెట్టు నీ వారాన్న పిండతతులు
గడగి భక్షింప నొక్కట గలసియాడు
చున్న యెలుకల పిల్లుల యొండుసహజ
వైరి వర్గంబులయు సహావాసమపుడు
చూచి మునిశక్తి కెంతయుఁ జోద్యమంది. (ఆది. 4-23)

ఇది శకుంతలోపాఖ్యాన మందలి కణ్వాశ్రమవర్ణనము. ఇది యాశ్రమము నందలి ప్రశాంతమైన వాతావరణమును పఠితలను సాక్షాత్కరింపఁజేయు చున్నది. సింహములు. ఏనుఁగులు. ఎలుకలు పిల్లులు మున్నగునవి సహజ వైరముగల జంతువులు. కణ్వుని తపః ప్రభావమున నవి సహజమైన యవైరమును విడిచి కలిసి మెలసి వర్తించు చుండెను. ఇది దుష్యంతునికి నాశ్చర్యము గల్గించెను. ఏనుఁగులు సంగీత ప్రియము లనుట వాఙ్మయ ప్రసిద్ధము. ఋషుల సామగానమును విని చిలుకలా మంత్రములను వినినట్లు పునరుక్త మొనరించు చుండ నేనుఁగులు పరవశములై కదలక వినుచుండెను. బ్రాహ్మణాదులు తాము భోజనము సేయుటకు ముందు భూత బలికి నన్నపిండములు బయట పెట్టుట యాచారము. అడవులలో నున్న బ్రాహ్మణులు నెవరి ధాన్యపు బియ్యముతో వండిన యన్నమును భూత బలిగా పెట్టుచున్నారు. ఏనుఁగులు తొండములతో నీరు పీల్చును. వాని నుండి నీటి బిందువులు పడు చుండును. ఆ నీటి బిందువుల సంపర్కమున తొండముల నీడ చల్లగా నుండుటయే కాక యచటి గాలికూడ చల్లగా నుండును. దాని నాశించి కదలక నిలఁబడి యున్న గజముల తొండముల నీడ పరుండి సింహములు సుఖించు చున్నవి. ఈ దృశ్యము లోకము వారికి కనఁబడునట్టిదిగాదు. నన్నయ దాని నిచ్చట చిత్రమునందువోలె విశదముగా గోచరింపఁజేసి యున్నాఁడు. ఈ సీసము నడక శ్రవణసుఖముగా నున్నది. విషయమును సూచించుటకోయన దీనిని నన్నయ "శ్రవణ సుఖంబుగా" నని ప్రారంభించి యున్నాడు.

16. ఎట్టి సాధ్వులకును బుట్టినయిండ్లను
బెద్దకాలమునికి తద్దతగదు
పతులకడన యునికి పతులకు ధర్మువు
సతుల కేదుగడయుఁ బతులచూవె. (ఆది. 4-66)

శకుంతలోపాఖ్యానమున కణ్వుఁడు భరతుని తేజోరూప విక్రమాదులు చూచి సంతసిల్లి యాతఁడు యౌవరాజ్యపట్టమునకుఁ దగియుండు టెఱింగి యొకనాఁడు శకుంతలతో నిట్లు పలికెను. ఎట్టి పతివ్రతలకైనను బుట్టిన యిండ్లయందు చాల కాలముండుట యుచితముగాదు. వారికి పతులకడ నుండుటయే ధర్మము. పతులకేడు దిక్కులును భర్తలే గదా!

నన్నయ ప్రత్యేకముగాఁ జెప్పుచుండు నీతిపద్యములలో నిదియు నొకటి. పతివ్రతలైన వారలు భర్తలకడనే యుండుట యుచితము. ఇచ్చటి సాధ్వీ, సతీ పద ప్రయోగము సాభిప్రాయము. దీనికి మూల మనఁదగిన శ్లోకము సంస్కృత భారతమునఁ గూడ నున్నది. కాని దీనిని వ్రాయునపుడు నన్నయ యభిజ్ఞాన శాకుంతల పంచమాంకమందలి "సతీమపిజ్ఞాతికులైక సంశ్రయా" మిత్యాది శ్లోకముచే ప్రభావితుఁడై నట్లు కనిపించుచున్నది. మూలమున కణ్వుఁడీ శ్లోకమును శిష్యులతోఁ జెప్పినట్లున్నది. నన్నయ యీ పద్యమును శకుంతలతోనే చెప్పినట్లు వ్రాసెను.

17. విపరీత ప్రతిభాషలేమిటికి నుర్వీనాథ! యీ పుత్ర గా
త్ర పరిష్వంగ సుఖమ్ము చేకొనుము ముక్తాహార కర్పూరసాం
ద్ర పరాగ ప్రసరంబు జందనముఁ జంద్రజ్యోత్స్నయుం బుత్రగా
త్రపరిష్వంగమునట్లు జీవులకు హృద్యంబే! కడున్ శీతమే!
(ఆది. 4-91)

శకుంతలోపాఖ్యానమున దుష్యంతుఁడు, శకుంతలను నిరాకరించినపు డామె ధర్మప్రబోధమొనరించుచు భార్యయొక్క ప్రాముఖ్యమును గూర్చి తెలిపి పుత్రునిఁ జూపి యిట్లనెను.

"ఓ రాజా! వ్యతిరేకములైన మాఱుమాటలెందుకు? ఈ కుమారుని దేహమును గౌఁగిలించుకొనుటవలని సుఖము ననుభవింపుము. ముత్యాలహారములయు, కర్పూర పురేణువులయు ప్రసారమును, మంచిగంధమును, చంద్రుని వెన్నెలయు, కుమారుని మేని కౌఁగిలింతవలె జీవులకు హృదయాహ్లాదకరమును, శీతలము నయియుండునా? ఉండవని భావము.

దుష్యంతుఁడు తన్ను నిరాకరించినపుడు శకుంతల తన్నాతఁడు చేపట్టి యుండుననుటకు నిర్ణాయకముగా కుమారుని శరీరము కౌఁగిలించుకొనుమని చెప్పు

చున్నది. ఇది మనస్తత్త్వమునకు సంబంధించినది. పుత్త్రగాత్ర పరిష్వంగ సుఖము ముక్తాహారము, కర్పూరపరాగము, మంచిగంధము, వెన్నెల మున్నగువానికంటెఁ గూడ హృదయాహ్లాదకరముగా నుండునని శకుంతల యభిప్రాయము. అట్లు లేకున్నచో తానతని భార్య కాదనియు, ముందున్న బాలుఁడు తన కుమారుఁడు గాదనియు నతఁడు నిశ్చయింపవచ్చును

18. నుతజల పూరితంబులగు నూతులు నూటికంటెఁ సూనృత
వ్రత! యొక బావి మేలు, మఱి బావులు నూటికంటె నొక్క స
త్క్రతు వది మేలు తత్క్రతు శతంబునకంటెఁ సుతుండు మేలు త
త్సుతశతకంబు కంటె నొకసూనృత వాక్యము మేలుసూడగన్.
(ఆది.4. - 24)

పై సందర్భమునందే శకుంతల దుష్యంతునితో సత్యవాక్యము యొక్క ప్రాశస్త్యము నిట్లు గ్గడించుచున్నది. మంచినీటితోఁ గూడిన నూఱు నూతులకంటె నొకబావి మేలు. నూఱు బావులకంటె నొక్క సత్క్రతువు మేలు. నూఱుక్రతువులకంటె నొక్క సుతుఁడు మేలు. నూర్గురు సుతులకంటె నొక్క సూనృత వాక్యము మేలు. ఇది సత్యముయొక్క సర్వోత్కృష్టతను ప్రశంసించు చక్కని పద్యము. శకుంతలను చెట్టవట్టియు "నేను నిన్నెఱుఁగ"నని నిరాకరించిన దుష్యంతుని నామె "సూనృతవ్రతః" యని సంబోధించుట యొక విధముగా నెత్తిపొడుపై సత్యవ్రత దీక్ష వహింపుమని యాతనిని హెచ్చరించుచున్నట్లున్నది. ఆమెతోఁగూడ వారికి జన్మించిన సుతుఁడు కూడ నున్నాఁడు. సత్యవాక్యము కంటె కొంచెము తక్కువయినను సుతుఁడు కూడ నిరాకరింపఁదగినవాఁడుకాఁడు పరిగ్రాహ్యుఁ డేయను విషయము గూడ నిందుసూచింపఁ బడినది.

19. గంగ నిజాంగదీప్తులెసఁగం జనుదెంచి లతాంగి సంతతో
త్తుంగ పయోధరద్వితయ తోయరుహానన చారునేత్ర ది
వ్యాంగననై ప్రతీప వసుధాధిపు శాలవిశాల దక్షిణో
త్సంగమునందు మన్మథవశంబున నుండెఁగరంబు లీలతోన్.
(ఆది. 4-135)

ప్రతీపుఁడు శంతనుని తండ్రి. అతఁడు రాజ్యసుఖములఁ దనిసి గంగాతీరమున యమ నియమవ్రత పరాయణుఁడై తపముసేయుచుండ గంగ దివ్యాంగనయై యాతనికిఁ ప్రత్యక్షమైన సందర్భము నందలి పద్యమిది.

గంగ తన శరీరకాంతులు వ్యాపింప ప్రతీపుఁడు తపస్సు చేయుచున్నచోటికి దివ్యాంగనారూపమున వచ్చి వలచి, యాతని సాలవృక్ష విశాలమైన కుడితొడయందుఁ గూర్చుండెను. ఈ పద్యమున గంగకు వేయఁబడిన విశేషణము లామె శరీరకాంతిని అంగమార్దవమును, స్తనౌన్నత్యమును, అన్యనేత్రముల సౌందర్యమును జక్కఁగా వర్ణించుచున్నవి. మొదటి రెండు పాదములందు బిందుపూర్వక 'గ' కార పునరావృత్తి శృంగార రసానుకూలమైన మాధుర్యమును పెంపొందించుచున్నది. కుడితొడ పురుష భాగమై పుత్త్రారోహణయోగ్యమైనది. ఎడమతొడ స్త్రీ భాగము. దానినెక్కక గంగ కుడితొడ నెక్కుటచేతనే ప్రతీపుఁడామెను గ్రహింపక నా పుత్త్రునకు భార్యవగుమని యాదేశించి పంపివైచెను.

20, నీలగిరీంద్ర శృంగమున నిర్మలమైన సువర్ణవల్లరీ
జాలముఁబోని పింగళ విశాల జటాచయ మొప్పఁగా వచ
శ్శ్రీలలితుండు వచ్చినిలిచెన్ హరినీల వినీల విగ్రహో
దాళ రుచుల్ వెలుంగఁగఁ బరాశరసూనుఁడు తల్లి ముందటన్.
(ఆది. 4-240)

సత్యవతి భీష్ముని సూచన ననుసరించి వంశము నుద్ధరింప సంతానమును బడయుమని వ్యాసుని నియోగింపనెంచి యాతనిఁ దలంచెను. అతఁడు పనిగలయప్పుడు తన్ను స్మరింపుమని మున్ను తల్లికిఁ జేసిన వాగ్దానము ప్రకారమామెకుఁ బ్రత్యక్షమైన సందర్భము నందలి దీ పద్యము.

నీలపర్వత శిఖరమున బంగారు లతలసముదాయమువలె పింగళ వర్ణముగల పెద్దజడల సమూహమొప్పఁగా వచ స్సంపన్నుఁడగు వ్యాసుఁ డింద్రనీల మాణిక్యము వోలె నల్లని తనమూర్తియొక్క కాంతులు ప్రకాశింపవచ్చి తల్లిముందు నిలిచెను. వచ శ్శ్రీలలితుఁడను విశేషణము వ్యాసుని యెడ మిక్కిలి సార్థకమైనట్టిది. అతఁడు మహా భారతమునకేగాక యష్టాదశపురాణములకును, బ్రహ్మసూత్రములకును గర్తయైన మహానుభావుఁడు. వ్యాసుని శరీరము నల్లనిదగుటచేతను, జటలు పింగళవర్ణములగుట చేతను నన్నయ యాతని శరీరమును నీలగిరీంద్రముతోడను, తలను తచ్ఛిఖరము తోడను, జడలను బంగారు వన్నెగల లతలతోడను బోల్చుట సమంజసముగానున్నది. అరాళమనఁగా వంకర యని యర్థము. ఇచ్చట ప్రకాశించునట్టియను నర్థము చెప్పు కొనుట యుక్తముగా నుండును.

21. అంగములలోన మే లుత్తమాంగ మందు
నుత్తమంబులు గన్నుల యుర్విజనుల
కట్టి కన్నులు లేవను నదియకాక (టంతెకాక)
యుత్తముఁడు గాఁడె సద్గుణయుక్తి నతఁడు. (ఆది. 5-11)

భీష్ముఁడు గాంధారపతియైన సుబలుని కూతురు గాంధారి రూపలావణ్య శీలశోభితయని బ్రాహ్మణుల వలన నెఱింగి విదురునితో నాలోచించి గాంధారిని ధృతరాష్ట్రుని కిమ్మని యడుగుటకై సుబలునిపాలికి వృద్ధజనులను బంపెను. సుబలుఁడు సుముఖుఁడై ధృతరాష్ట్రునకు గాంధారి నిచ్చితినని పలికెను. అప్పుడు బంధుజనులు తమలో నిట్లను కొనిరి.

"సర్వస్య గాత్రస్య శిరఃప్రధాన" మ్మను నానుడినిబట్టి యవయవము లన్నింట శిరస్సు మేలైనది. ఆ శిరసు నందు కన్నులు మేలైనవి. అట్టి కన్నులు లేవనుటయే కాని ధృతరాష్ట్రుఁడు సద్గుణసంపదచేనుత్తముఁడు కాఁడా! ధృతరాష్ట్రుఁడు గుణవంతుఁ డయ్యును నంధుఁడు. అట్టివానికి సాధారణముగాఁ గన్య నిచ్చుట కెవ్వరు నంగీక రింపరు. కాని సుబలుఁ డందుల కంగీకరించి 'యతనికి కన్యనిచ్చితి' నని పలికెను. ఇచటి భూతకాల ప్రయోగ మా రాజు దృఢనిశ్చయమును, నిరంకుశత్వమును దెలుపు చున్నది. అందుచేతనే బంధుజను లాతనికి నెదురాడ వెఱచి పైవిధమునఁ దమలో ననుకొనిరి. ఈ పద్యమున నొక్క విధమైన హేళన మున్నది. అన్నిటికన్న ప్రధానము లైన కన్నులు లేవనుదే కాని, యతఁడు గుణము లందుత్తముఁడే యనుట యందా హేళ నము గోచరించు చున్నది.

22. కోరిన కోర్కికిం దగఁగ గొంతి సుతత్రితయంబు గాంచె గాం
ధారియు నక్కడన్ సుతశతంబు ముదంబొనరంగఁ గాంచె నేఁ
బోరచి యాఁడుఁబుట్టువునఁ బుట్టి నిరర్థక జీవనైతి సం
సార సుఖావహంబయిన సత్సుత జన్మముఁ గానఁ బోలమిన్.
(ఆది. 5-129)

కుంతికి ధర్మానిలేంద్రుల యనుగ్రహమున ముగ్వురు పుత్త్రులు పుట్టిరి. పాండు రాజు సంతోషించి వారితోడి వినోదంబులఁ దగిలి యుండ మాద్రి తన యందు పుత్త్రి జన్మంబు వడయు నుపాయంబు లేమికి దుఃఖించి తనలో నిట్లను కొనినది.

కుంతి కోరిన కోరికకు తగినట్లు ముప్వురు పుత్త్రిలను గాంచినది. హస్తినా పురమున గాంధారియు నూర్గురు కుమారులను గాంచినది. నేను వ్యర్థమైన యోడు పుట్టుక పుట్టియు సంసారసుఖమునకుఁ బరమార్థమైన సత్పుత్త్రినిఁ బడయఁజాలక నిష్ప్రయోజనమైన జీవితము గలదాన నైతిని. మూలము నందీ సందర్భమున తన సవతికిని, గాంధారికిని బుత్రులు వుట్టినందులకు మాద్రి యీర్ష్య చెందినట్లున్నది. నన్నయ దానిని మార్చి సంసారసారమైన సుతునిఁ బడయమికి నామె దుఃఖించినట్లు వ్రాసియున్నాఁడు. నిజమునకు స్త్రీకి మాతృత్వము పరమసంతోషప్రదమైనట్టిది. అది వివాహమునకును, జన్మమునకును సార్థక్యమును గలిగించును. అట్టి సుత జన్మము లేమికి స్త్రీ విచారించుటలో దోషము లేకపోవుటయే కాక యౌచిత్యముగూడ నున్నది.

23. కమ్మని లతాంతములకు మ్మొనసివచ్చు మధుపమ్ముల
సుగీత నినదమ్ములెసఁగెం జూ
తమ్ముల లసత్కిసలయమ్ముల సుగంధి ముకుళమ్ములను
నానుచు ముదమ్మొనర వాచా
లమ్ములగు కోకిల కులమ్ముల రవమ్ము మధురమ్మగుచు
విన్చె ననిశమ్ము సుమనో భా
రమ్ముల నశోక నికరమ్ములును జంపకచయమ్ములును
గింశుకవనమ్ములును నొప్పెన్.
(ఆది. 5-138)

మృగ రూపములను ధరించి విహరించు చున్న కిందమ దంపతులను పాండు రాజు బాణనిహతులను గావించినపుడు కిందముఁ డాతనికి "నీవును ప్రియా సంగమం బైనప్పుడు పంచత్వము వొందెద"వని శాప మొసంగెను. అప్పటి నుండియు పాండు రాజు సర్వసంగమును విడిచి సమచిత్తుఁడై తపముసేయు చుండెను. కుంతికి ధర్మ రాజాదులు జనించిన పిమ్మట కొంత కాలమున కఖిలజనలోకానంద జనసంబైన వసంతర్తు వేతెంచెను. నన్నయ యా వసంతము నిట్లు వర్ణించెను.

సువాసన గల పుష్పులపై వ్రాలుట కేతెంచు తుమ్మెదల సంగీత ధ్వను లతిశయించెను. మామిడిచెట్ల చిగురాకులను సురభిళములైన మొగ్గలను నాస్వాదించుచు కోకిలలు మధురముగాఁ గూయుచుండెను. అశోక చంపక కింశుక వృక్షములు పూలతో నిండి యొప్పు మీఱినవి ఇచ్చటి వసంత వర్ణనమునకుఁ గొంత ప్రాధాన్య

మున్నది. మూలమున లేకపోయినను నన్నయ యిట వసంత ఋతువును రెండులయ గ్రాహులతో వర్ణించెను. ఈ పద్యము నందలి ప్రాసరూపమైన మకారద్వయ పునఃపున రావృత్తి వసంత మందలి తుమ్మెదల ఝుంఝుమ్మను ధ్వనులను దలపించు చున్నది. ఇందు నన్నయ వసంతము యొక్క సర్వస్వరూపమును సమగ్రముగాఁ జిత్రించెను. అట్టి వసంత సమయమున సంగవర్జితుడై యున్న పాండురాజుకూడ శృంగారరస పరవశుఁడై మన్మథ బాణములకు గుఱియయ్యెను. అప్పు డాతఁడు మాద్రి వారించు చున్నను వినక సంభోగ సుఖము ననుభవించి మరణించెను. శాపము సంగతి స్మృతి యందున్నను పాండురాజు కాంతా సంగమాసక్తుఁడగుట కుద్దీపనముగా వసంతము కావలసి వచ్చినది. అందుచేతనే నన్నయ మూలమున లేకపోయినను దాని నిచ్చట వర్ణించెను.

24. కురుకులజుండు పాండునకుఁ గుంతికిఁ బుత్త్రుఁడు రాజధర్మ బం
ధురచరితుండు నీవితనితోడ రణంబొనరించెదేని వి
స్తరముగ నీదు వంశమును దల్లినిఁదండ్రినిఁ జెప్పు, చెప్పినన్
దొరయగుదేని నీకెదిరి దోర్బలశక్తి నితండు సూపెడిన్.

(ఆది. 6-45)

కుమారాస్త్ర విద్యాప్రదర్శన సందర్భమున దుర్యోధనుని యనుమతితోఁ గర్ణుఁ డర్జునునితో ద్వంద్వయుద్ధము సేయుటకు రంగమధ్యమున కరుదెంచెను. అపుడు ధర్మవిదుఁడు, ద్వంద్వయుద్ధసమాచార నిపుణుఁడునైన కృపాచార్యుఁడు కర్ణార్జునుల నడుమ నిలిచి కర్ణునితో నిట్లనెను.

కురువంశ సంభవుఁడైన యర్జునుఁడు కుంతీ పాండులకుఁ బుట్టిన పుత్త్రుఁడు. రాజధర్మముతో నొప్పు చరిత్రము గలవాఁడు. నీ వీతనితో రణము సేయఁ దలంచినచో నీ వంశమును దల్లిదండ్రులను బేర్కొనుము. నీవు దొరయైనచో నర్జునుఁడు నిన్నెదిరించి తన బాహుపరాక్రమమును బ్రదర్శించును. కృపాచార్యుఁడు ద్వంద్వయుద్ధ నియమములన్నియు నెఱిఁగినవాఁడు. ఆ నియమము ప్రకారము సమానాభిజాత్యము గలవారే యొండొరులతో యుద్ధ మొనరింపవలయును. అందుకే కృపాచార్యుఁ డర్జునుని కులమును దల్లిదండ్రులను బేర్కొని కర్ణునిఁ గూడ తనవంశమును దల్లిదండ్రులను జెప్పుమనెను. ఇచ్చట 'దొర' శబ్దప్రయోగ మర్థ గంభీరమైనది. దొరయనఁగా సాటి, రాజు-అను రెండర్థములు నున్నవి. కృపాచార్యుఁడు దానిని సాటి

యను నర్థమున వాడెను. దుర్యోధనుఁడు దానిని ద్వితీయార్థమున గ్రహించి కులము గలవాఁడు, శౌర్యముగలవాఁడు, అధిక సేనగలవాఁడు రాజను పదమున కర్హుఁడని పలికి రాజవరుఁడైన యర్జునునితో రాజుగాని యీతఁడని సేయఁదగనిచో మీరందఱు సూచుచుండ నీతనినిప్పుడే రాజుఁ జేసెదనని యతని నంగరాజ్యమునకు పట్టాభిషిక్తు నొనర్చెను.

25. ఇమ్ముగ నాత్మరక్ష విధియించు విధంబున మంత్రరక్ష య
త్నమ్మునఁ జేయఁగావలయుఁ దత్పరిరక్షణ శక్తినెల్ల కా
ర్యమ్ములు సిద్ధిఁబొందుఁ బరమార్థము మంత్ర విభేదమైన గా
ర్యమ్ములు నిర్వహింపఁగ బృహస్పతికైనను నేరఁబోలు నే.
(ఆది. 6-111)

ధర్మజుఁడు యౌవరాజ్య పట్టాభిషిక్తుఁడైన పిమ్మట దుర్యోధనుఁ డోర్వక కర్ణశకుని దుశ్శాసనులతో నాలోచించి రాజనీతి యెట్టిదో నాకెఱింగింపుఁడని యడుగ శకుని యాప్తమంత్రియైన కణికుఁ డాతని కెఱింగించిన నీతులలో నిదొకటి.

రాజు తన్ను రక్షించుకొనునట్లే మంత్రరక్షణము గూడ కావింపవలెను. మంత్రమును రక్షించుటయందుఁగల సామర్థ్యముచే నెల్లపనులును సిద్ధిపొందుటసత్యము. మంత్ర విభేదమైనచో ననఁగా- మంత్రము రహస్యముగాక వెల్లడియైనచో- బృహస్పతి వంటి బుద్ధిమంతునికిఁ గూడ కార్యనిర్వహణ మశక్యమగును. కణికనీతి ప్రసిద్ధమైనది. ఈ పద్యమున మంత్రరక్షణ ప్రాముఖ్య ముగ్గడింపఁబడినది.

26. ప్రమదాపాది పయః ప్రపూర్ణమిదియోఁ బద్మాకరంబంచుఁ ద
త్కమలామోద సుగంధ మారుతము వీఁకన్ మున్నెఱింగించినన్
రమణంబొల్చె సరోవరంబనిలజున్ రాజీవ రాజీవ స
త్సమదాలి వ్రజ చక్రవాక బక హంస క్రౌంచనాదంబులన్.
(ఆది. 6-178)

లాక్షా గృహదహనమునుండి తప్పించుకొని పాండవులు గంగదాఁటి దక్షిణాభిముఖులై చనుచు నొకగహనము ప్రవేశించిరి. భీముఁడు వారినందఱ నెత్తుకొని సాయంకాలమున కొక్కవటపాదపము చెంతకరిగి వారినచ్చట దించి చెట్టుపైకెక్కి నీటికొఱకు వెదకుచుండఁగా సరోవరాగతమైన చల్లనిగాలి వీచెను. ఆ సందర్భమున నన్నయ వ్రాసిన పద్యమిది.

సంతోషము నొసంగు నీటితో నిండిన సరస్సిది యని యందలి కమలముల సుగంధముచే సురభిళమైన వాయువు వీచి ముందుగా నెఱింగింప నా సరస్సు భీముని పద్మముల సముదాయమున వసించు మదించిన తుమ్మెదలు, చక్రవాకములు, కొంగలు, హంసలు, క్రౌంచపక్షులు మున్నగువాని ధ్వనులచే రమ్మని సాదరముగాఁ బిల్చెను. భీముఁడు నీటికై వెదకుచుండఁగా ముందు కమల గంధ బంధురమైన వాయువు వీచెను. ఆ వాయువు వీచుట మంచినీటితోఁ గూడిన సరస్సిక్కడ నున్నదని ముందెఱింగించు చున్నదివోలె నున్నది. తరువాత తుమ్మెదలయు, చక్రవాకాదులయు కూజితములు విన్పించెను. ఆ కూఁతలు వారిని రమ్మని యాహ్వానించుచున్నట్లుండెను. "రాజీవ రాజీవ స"త్తను చోటఁగల యమకాలంకార మప్రయత్న సిద్ధమై యత్యంత సుందర ముగా నున్నది. పద్యము నడక సురభిళవాయువు వీచునపుడువలె నాహ్లాదము గల్గించుచున్నది. చివరిపంక్తియందలి వ్రజ చక్రవాక, క్రౌంచ యనుపదములందలి రేఫ మును 'క'కారవునరావృత్తియు నాపక్షుల కూఁతలను దలంపునకుఁదెచ్చుచున్నవి.

27. బాలకుండు కొండుకకోల చేతఁ
బట్టుకొని యేన రక్కసుఁగిట్టి చంపి
చులుకవత్తు మీరేడ్వఁగా వలవదనుచుఁ
గలయ నోదార్చెఁదన దొక్కుఁబలుకులొప్ప. (ఆది. 6-263)

పాండవు లేకచక్రపురమున నొక బ్రాహ్మణుని యింట నివసించుచున్నపుడు బకాసురు నికి భోజనము పంపవలసిన వంతా బ్రాహ్మణుని యింటికి వచ్చెను. అప్పు డా బ్రాహ్మణుఁడును, నతనిభార్యయు, కూఁతురును బకున కాహారముగా "నేనుబోయెద, నేనుబోయెద"నని పలుకుచు నేడ్చుచుండిరి. అప్పుడొక్క చిఱుత బాలుఁడు కన్నీళ్లు తుడుచుచు వారినోదార్చెనని చెప్పుచు నన్నయ యీ పద్యమును వ్రాసెను.

బాలకుఁడొక్క చిన్న కఱ్ఱచేతితో బట్టుకొని "నేనే యారాక్షసుని సమీపించి వానినిఁ జంపి యనాయాసముగా వచ్చెదను. మీరేడ్వవల"దని పల్కుచు వచ్చియు రాని తన ముద్దుపల్కులతో వారిని నూఱడించెను. బాలకుని కప్పటి పరిస్థితి యందలి నైశిత్యము తెలియదు. ఆ రాక్షసు డెటువంటి వాడో యాతని బలమెట్టిదో తానా కఱ్ఱతో నతనిఁజంపగలడ్రోఁలేదో యతనికిఁ దెలియదు, తల్లిదండ్రులు నక్కయు నేడ్చుచుండ నతని మనస్సున నించుక కలఁతగలిగెను. అతఁడు సహజమైన సానుభూతితో వారి నోదార్చెను. ఈ పద్యమున నన్నయ శిశుమనస్తత్త్వ పరిజ్ఞానము చక్కగా వెల్లడియగు చున్నది.

28. దారుణ జానుదండమున దండధరప్రతిముండు భీకరా
కారుఁడు వాని వీపు విఱుఁగంబొడిచెం బిశితంబుతో నవ
ద్వారములన్ మహారుధిరధారలు బోరన నొల్కి మాంసపం
కారుణవారిఘోర నదులై పఱవన్ విపినాంతరమ్మునన్.

(ఆది 6-305)

భీమబకాసురుల యుద్ధమును వర్ణించిన పిమ్మట, భీముఁడు బకాసురుని సంహరించిన విధమును నన్నయ యీ పద్యమున వర్ణించెను. యమ సన్నిభుఁడుకు, భయంకరాకారుఁడునునైన భీముఁడు మాంసముతోఁగూడ తొమ్మిది రంధ్రములనుండియు రక్తధారలు కారి మాంసమనెడి బురదతోఁగూడిన రక్తమయమైన భయంకర నదులై యడవి నడుమ ప్రవహింప ఘోరమైన దండమువంటి తన మోకాలితో బకాసురుని వీఁపు విఱుఁగఁబొడిచెను. భీముడు, బకుఁడును తుల్య పరాక్రములు అయినను భీముఁడు బకుఁడు హీనసత్త్వుఁడగుట యెఱింగి తన రెండు చేతులతో నా రక్కసుని కటి కంఠప్రదేశములు పట్టుకొని మోకాలితో వీఁపు విఱిచి సంహరించెను. నన్నయ యీ పద్యమున భీముఁడా రాక్షసుని సంహరించిన క్రమమును పాఠకుల కన్నులకు సాక్షాత్కరింపజేయుచున్నాడు.

29. త్రిభువనలక్ష్మి యే తెంచి యేకాంతమి
 ట్లిలోకోయున్నది యువ్వనమున
గగనమణి ప్రభగగనంబు నందుండి
 యవనీ తల ప్రాప్తమయ్యె నొక్కొ
శంభుండు లావణ్య సద్గుణ సముదాయ
 మింద యిమ్ముగ సంగ్రహించె నొక్కొ
దీని యంగములఁ బొందిన యీ విభూషణ
 శ్రీయేమి పుణ్యంబు సేసె నొక్కొ
యమరకన్య యొక్కొ యక్షకన్యక యొక్కొ
సిద్ధ కన్యయొక్కొ శ్రీ సమృద్ధి
సర్వలక్షణ ప్రశస్తాంగి యిది దివ్య
కన్యయగు ననంతకాంతి పేర్మి. (ఆది. 2-78)

సంవరణుండుఁ వేటకై వనమున కరిగి యలసి పాదచారియై నడచుచు నొక పర్వత వనప్రదేశమున సూర్యపుత్రియైన తపతినిఁజూచి మనసున నిట్లు వితర్కరించెను.

స్త్రీవర్ణన సందర్భమునందు నన్నయ మిక్కిలి యౌచిత్యమును నిగ్రహమును ప్రదర్శించును. అయ్యు నతని వర్ణనములు గంభీరములై యా స్త్రీల సమగ్ర సౌందర్యమును సాక్షాత్కరింపజేయుచుండును. ఈ పద్యము తపతి కచకుచాది వర్ణనములేక పోయినను నామె దివ్యసౌందర్యసమన్వితయని చెప్పక చెప్పుచున్నది. ఆమె యందు త్రిభువనలక్ష్మి సామ్యము గోచరించుచున్నదనియు, సూర్యకాంతివంటి కాంతి నిండారి యున్నదనియు, లావణ్య సద్గుణ సముదాయమంతయును నామెయందు పుంజీకృతమై యున్నదనియు, నా యంగములవలన నాభరణములకే యందము చేకూరుచున్నదనియు. నామె సర్వలక్షణ ప్రశస్తాంగియనియు చెప్పుటలో నామె యతిలోక సౌందర్య సంపద ద్యోతితమగుచున్నది. ఈ సీస పద్య మేపాదమున కాపాదము విఱిగి శ్రవణ సుభగమై తర్వాత కవుల సీస పద్యరచనకు మార్గదర్శక మన్నట్లున్నది.

30. **మధ్యాక్కర :**

మృదురోమములును శంకునిభకర్ణముల్ మెత్తని వలుఁద
పొదుఁగును నిడుదచన్నులును గుఱుచ్చలై పొలుచు కొమ్ములును
సదమల శరదిందు శంఖ నిభమైన చాయయుఁ గలుగు
మొదవిది నిధి చేరినట్లు చేరె నిమ్మునికిఁ బుణ్యమున.

(ఆది. 7 - 99)

అంగారపర్ణుఁ డర్జునకు వసిష్ఠుని మహిమ చెప్పు సందర్భములోనిది యీ పద్యము. విశ్వామిత్రుఁడు మృగయార్థమరిగి సేనతో వసిష్ఠు నాశ్రమము చేరుకొనెను. వసిష్ఠుఁ డాతనిఁ బూజించినందినియను తన కామధేనువును వివిధాహారములు గురియఁ బంచెను. విశ్వామిత్రాదులు వానిని భుజించి తృప్తులైరి. తరువాత విశ్వామిత్రుడా నందిని సౌందర్యముఁజూచి మనస్సులో నిట్లనుకొనెను.

మృదువైన రోమములును, శంకువలె మొనదేరిన చెవులను, మెత్తని గుండ్రని పొదుగును, పొడుగైన చన్నులును, కుఱుచలై యొప్పు కొమ్ములును, శరత్కాల చంద్రునితోడను,శంఖముతోడను,బోలు తెల్లని మైచాయయుఁగలుగు నీ యా వదృష్ట వశమున వసిష్ఠమునికి నిధానము చేరినట్లు లభించినది. ఈ పద్యమున నద్ధేనువున

కుండవలసిన లక్షణములు చక్కగా వర్ణింప బడినవి. దీనిని చదువునపుడు నందిని సుందరమైన యాకారము కనులయెదుట సాక్షాత్కరించును. "నిధిచేరినట్లు" అను నుపమానముచే నా నందిని మహత్త్వమంతయు సమగ్రస్ఫూర్తి నందుచున్నది. నన్నయకు బూర్వమందలి యుద్ధమల్లుని బెజవాడ శాసనములో మధ్యాక్కర పద్యము గలదు. ఇది దేశిపద్ధతికిఁ జెందినది. నన్నయ తరువాత నాధునికకాలము వఱకును నొక్క యెఱ్ఱా ప్రెగ్గడ యరణ్య పర్వశేషమునఁ దప్ప మఱియెవ్వరు నీ వృత్తమును వాడి యుండ లేదు.ఎఱ్ఱన కూడా నన్నయ రచనయని తోఁప జేయుటకు గాఁబోలు నారణ్యపర్వమున మధ్యాక్కరలు వ్రాసెను. నన్నయ ప్రతిపాదమునను పంచమగణారంభమున యతివేయగా నెఱ్ఱన నాల్గవగణము మొదట వేసెను. తరువాత లాక్షణికు లెఱ్ఱన పాటించిన లక్షణములనే విశదీకరించిరి. మధ్యాక్కరలలో గతి వేగము తక్కువ. మఱి నన్నయ వ్రాసినవి మాత్రము ధారాశుద్ధిలోఁ గొఱవడక సుందరగమనముతో విలసిల్లుచుచున్నవి.

81. ఆ లలితాంగియందు హృదయంబును దృష్టులు నిల్పి పాండుభూ
పాల తనూజ పంచకము పంచశరాహతిఁ బొందె నొక్కతన్
బాలికఁ దొల్లి యేవురకు భామినిఁగా సృజియించి యున్న య
య్యాలరి బ్రహ్మచెయ్యి పరమార్థము గా కది యేల యొండగున్.
(ఆది. 7-213)

స్వయంవరానంతరము భీమార్జునులు ద్రౌపదీ సహితులైతల్లి కడ కరుదెంచి, మ్రొక్కి, మే మొక్క భిక్ష తెచ్చితిమని యామెకు నివేదించిరి, కుంతీదేవి యెప్పటి యట్ల మీ రేవురు నుపయోగింపుఁడని కొడుకుల నియోగించి, తరువాత ద్రౌపదినిఁ జూచి లజ్జించుచుండ ధర్మరాజు తల్లి నోదార్చి యర్జును నామెను బెండ్లియాడుమని ప్రేరేచెను. అర్జునుఁడు ధర్మరాజునే యామె నగ్రనుహిషిగా పరిగ్రహింపుమని వేడి తను నలువుర యాశయమును నట్టిదేయని తెల్పెను. అప్పుడు విధిప్రేరణమున పాండవు లైదుగురికిని ద్రౌపదిపై వలపు జనించెనని చెప్పు సందర్భమున నన్నయ వ్రాసిన పద్యమిది.

మృదువులైన యంగములుగల ద్రౌపదియందు మనస్సును, చూడ్కులును నిల్పి పాండవులైదుగురును మన్మథుని అయిదుబాణములకును గుఱియైరి. ఒక్క బాలిక నైదుగురికి భార్యగా సృజయించియున్న యా మాయబ్రహ్మకార్యము సత్యముగాక యన్య

యెట్లగును. ద్రౌపదియందు పాండవులైదుగురి దృష్టులును నొక్కటఁ దగుల్కొనుట విధివిధానము. దృష్టులేగాక హృదయములుగూడ నిల్పుట యాంతరమైన ప్రేమకుఁ దార్కాణము. పాండవ పంచకము పంచశరహతిఁ బొందెననుటలో చమత్కారమున్నది. బ్రహ్మయా యొక్కతెయె యైయిదుగురికి భార్య కావలెనని మున్నే నిర్ణయించెను. ఆ నిర్ణయము ప్రకారమైదుగురికి నామె యందును రాగమావహించినది.

32. నగియును బొంకునందు వచనంబు నధర్మమునందుఁ జిత్తముం
దగులదు నాకు నెన్నడును ధర్మ్మ వవశ్యము నట్ల కావునన్
వగవక మాకు నేవురకు వారిజలోచన కృష్ణ నీఁదగుం
దగ దను నీవిచారమును దక్కి వివాహ మొనర్పుమొప్పగన్.
(ఆది. 7-252)

ఒక్కతె నైదుగురికిచ్చి వివాహము సేయుట యెట్లని సంశయాకులితుడైన ద్రుపదునికడకు వ్యాసుఁ డరుదెంచెను. ద్రుపదుఁ డాతని కీ విషయమునుదెల్పి ధర్మ నిర్ణయము సేయుమని యడుగ, ధర్మజుఁడు వ్యాసుని సమక్షమున ద్రుపదునితో నిట్లనియెను "నవ్వులాటకైనను నా వాక్య మసత్యమందును, చిత్త మధర్మమునందును నాసక్తములై యుండవు. ధర్మము జరిగితీరవలయును. కావున విచారింపక మా కైదుగురకు ద్రౌపదినిచ్చి వివాహము చేయుట యుక్తము. తగదేమో ! యను నాలోచనను విడిచి యొప్పుగా వివాహ మొనరింపుము". ఇది ధర్మరాజునకు ధర్మము నందుఁగల దృఢ నిశ్చయమును దెల్పుచున్నది. ఈ పద్యమలతియలఁతి మాటలతో గూడియు ధారాసౌందర్యము గలిగి యింపు నింపు చున్నది.

33. రవినిభతేజుఁడైన ధృతరాష్ట్రుఁడు పంపఁగ నీవు కార్య గౌ
రవమున వచ్చినప్పుడ తిరంబుగ వీరికి నిష్టసిద్ధి దా
నవు టది యేమి సందియమె ? యంబుజనాభుఁడు నీవుఁ బాం
డవప్రవరుల కెల్లప్రొద్దును శుభంబ తలంతువుగాదె నెమ్మితోన్.
(ఆది. 8-56)

ద్రౌపదీ స్వయంవరానంతరము ధృతరాష్ట్రుఁడు పాండవులఁదోడ్తేర విదురుని ద్రుపదుని కడకుఁ బంపెను. ద్రుపదుని దర్శించి విదురుఁడు ద్రౌపదీసహితులైన పాండవులఁ బంపుమని యడుగా ద్రుపదుఁ డిట్లనెను.

సూర్యసమతేజుడైన ధృతరాష్ట్రుడు పంపఁగా గార్యము నందలి గౌరవముచే నీవిట వచ్చుటచే పాండవులకింక నిష్టసిద్ధి చేకూరుననుటకు సందేహము లేదు. కృష్ణుఁడును, నీవు పాండవశ్రేష్ఠుల కెల్లప్పుడును ప్రేమతో శుభమే తలంచుచుందురు. ద్రుపదుఁడు విదురునితో మాటలాడిన తీరెంతో గౌరవసహితమును సమయోచితమునై యొప్పారు చున్నది. ధృతరాష్ట్రునియందు విశ్వాసము లేకపోయినను ద్రుపదునికి విదుర కృష్ణుల యందమితమైన విశ్వాసముండుట యీ పద్యమున వ్యక్తమగుచున్నది.

34. పరిఘుజలంబులం దమలపంకరుహోత్పల కైరవాది సుం
దరకుసుమంబులున్ ఘనపథంబున నుజ్జ్వల తారకా నిరం
తర కుసుమంబులున్ వెలయఁ దత్పురవప్రము పాదపీఠికా
శిరముల కొప్ప నర్చనలు సేసిన పువ్వుల యవ్విధంబునన్,
(ఆది. 8-76)

ధృతరాష్ట్రుఁడు పాండవుల కర్ధరాజ్య మొసంగి ధర్మరాజునభిషిక్తునిఁ జేసి ఖాండవ ప్రస్థమున కరిగిరి, అచ్చట కృష్ణుఁ డింద్రుని దలంచెను. ఇంద్రుఁడు విశ్వకర్మ నమర పురమున కెనయగు పురము నచ్చట నిర్మింపుమని పంచెను. ఆ పురవర్ణనము నందలిదీ పద్యము.

కోట చుట్టునుండు నగడ్తలోని పద్మములు, కలువలు మునగు నందములైన పువ్వులును, నాకసమున ప్రకాశించు నక్షత్రములను పువ్వులును, నాపురము నందలి కోటప్రాకారము పాదపీఠమునకును, శిఖరమునకును నొప్పుగాఁ బూజసేసిన పువ్వుల విధమున చెన్నారునుఁ ఇందు క్రమాలంకారమును నుత్ప్రేక్షా లంకారమును గలవు. పరిఘయందలి పువ్వులు పాదపీఠమునకును. ఆకసము నందలి తారకలు వప్రశిఖరము నకును బూజసేసిన పువ్వుల విధమున నొప్పారెనని భావము. ఈ సన్నివేశమునందలి పురవర్ణన పద్యములు ప్రౌఢములై యుపమోత్ప్రేక్షా శ్లేషాలంకారపూరితములై పదునా ఱవశతాబ్దిలో వెలసిన ప్రబంధముల యారంభము నందలి పురవర్ణన పద్యములకు మేల్బంతులై యున్నవి.

35. ఇంతుల నిమిత్తమున ధృతిమంతులుఁ బొందుదురు భేదమతి
గావున మీ
రింతయు నెఱింగి యొండులు చింతింపక సమయమిందుఁ
జేయుడు బుద్ధిన్ (ఆది. 8-114)

పాండవులు ఖాండవప్రస్థమున నున్నతఱి నారదుఁడు వారినిచూడనరుదెంచి "ద్రౌపది కారణమున మీకు విప్రీతి పుట్టకుండ నుండవలెనని పల్కి తొల్లి సుందరి కారణమున నొండొరులతోఁ బోరాడి మరణించిన సుందోపసుందుల వృత్తాంతము వారి కెఱింగించెను. స్త్రీల కారణమున ధైర్యమును, బుద్ధియుగల ధీరులుగూడ భేదభావమును బొందుదు రనునది సుందోపసుందుల కథవలనఁ దెలియవచ్చునీతి. అందుచే పాండవులు ధృతిమంతులయ్యు నేక భార్యా నిమిత్తమున నట్టిభేదమును బొందకుండ నారదుఁడు, ద్రౌపదివారితో నొక్కొక్కయింట నొక్కొక్క యేడు క్రమముగా నుండవలెననియు, నామె యున్న యింటివలన నితరులు వెడలకూడదనియు, నెఱుఁగక వెడలినచొ పండ్రెండు నెలలు తీర్థసేవయను విశేషవ్రతము చేయవలెననియు సమయము గావించెను. పాండవులందు కొడంబడిరి.

36\. దక్షిణగంగనాఁ దద్దయు నొప్పిన
గోదావరియు జగదాదియైన
భీమేశ్వరంబును బెడఁగగు చున్న శ్రీ
పర్వతంబును జూచి యుర్విలోన
ననఘమై శిష్టాగ్రహార భూయిష్ఠమై
ధరణీసురోత్తమాధ్వర విధాన
పుణ్యసమృద్ధమై పొలుచు వేఁగీ దేశ
విభవంబుఁ జూచుచు విభుఁడు దక్షి
ణాంబురాశి తీరంబున కరిగి దురిత
హారియైన కావేరీ మహాసముద్ర
సంగమంబున భూసురేశ్వరుల కభిమ
తార్థదానంబుఁ జేసికృతార్థుఁ డగుచు. (ఆది. 8-139)

అర్జునుఁడు సమయభంగ మొనరించిన కారణమున భూప్రదక్షిణ మొనరించుచు, పెక్కు తీర్థక్షేత్రములను దర్శించి దక్షిణమునకుఁగూడ వచ్చినట్లు మూలమున నున్నది. నన్నయ యీ యవకాశమును బురస్కరించుకొని గోదావరీ భీమేశ్వర, శ్రీపర్వతములనేగాక తన ప్రభువైన రాజరాజనరేంద్రుఁడు పాలించు వేఁగిదేశ విభవమునుగూడ వర్ణించెను, ఇది యమూలకము. దీనివలన నన్నయకుఁగల స్వదేశాభిమానమును నప్పటివేఁగీ దేశము నందలి పరిస్థితులును వ్యక్తము లగుచున్నవి.

37. ఉరుతరదావపావక శిఖోత్కలిత శ్వసనంబులున్ సితే
తరగతి తీవ్ర తిగ్మకరధామసహస్రములున్ బహుప్రవా
హ రహితనిమ్నగాతతులునై కడుదీర్ఘములై నిదాఘవా
సరములు సర్వజీవుల కసహ్యము లయ్యెను దారుణంబులై.
(ఆది. 8-230)

సుభద్ర కభిమన్యుఁడును ద్రౌపది కుపపాండవులును పుట్టిన పిమ్మట పాండవులు రాజ్య మొనరించుచు సుఖముగా నుండిరి. అప్పుడు వేసవికాల మరుదెంచెను. దాని వర్ణన మీ పద్యము.

గొప్ప కార్చిచ్చుల జ్వాలలతోఁగూడిన వాయువులు గలవియును. అగ్ని యొక్కయు. తీవ్రభానుని యొక్కయు. తేజస్సముదాయములు గలవియును, ప్రవాహ హీనములైన నదులు గలవియునై, మిక్కిలి దీర్ఘములై వేసవికాలపు దివసములు భయంకరములై సర్వప్రాణులకును సహింపశక్యము కానివయ్యెను. వేసవికాలమున కార్చిచ్చులు చెలరేగును. వానివలన వాయువు లుష్ణములగును. అగ్నియు సూర్యుఁడును తీవ్రమైన కాంతితోఁ బ్రకాశింతురు. నదులందలి ప్రవాహము లెండిపోవును. పగళ్లు దీర్ఘములగును. సర్వప్రాణులును నెండవేడిమిచే బాధననుభవించును. ఈ పద్యము స్వభావోక్తి కిరవై వేసవికాలపు స్వరూపమును విశదము సేయుచున్నది.

38. మదమాతంగ తురంగ కాంచన లసన్మాణిక్య గాణిక్య సం
పద లోలిం గొనివచ్చి యిచ్చి ముదమొప్పంగాంచి సేవించి ర
య్యుదయాస్తాచల సేతుశీతనగమధ్యోర్వీపతుల్ సంతతా
భ్యుదయున్ ధర్మజుఁ దత్సభాస్థితు జగత్పూర్ణ ప్రతాపోదయున్.
(సభా. 1-19.)

ధర్మరాజు మయుఁడు నిర్మించిన సభలో ప్రవేశించిన యనంతరము పలువురు రాజులు వచ్చి యాతనిని సేవించు సందర్భమున నన్నయ యీ పద్యమును వ్రాసెను.

మదించిన యేనుఁగులు, గుఱ్ఱములు, బంగారము, మణులు, గణికాసమూహము మున్నగు వానినిఁదెచ్చి, తూర్పు పడమరల పర్వతముల యొక్కయు, సేతుహిమా చలముల యొక్కయు నడుమనున్న రాజులందఱును, నిత్యోదయుఁడు, సర్వజగత్పరి

పూర్ణ ప్రతాపుఁడు, సభాస్థితుఁడునైన ధర్మజునకు నర్పించి అతని సేవించిరి. ఈ పద్యము నన్నయ ధారాశుద్ధికి పరమోదాహరణముగా పేర్కొనఁబడు చున్నది. మూలమున ధర్మజునే యే రాజులు వచ్చి సేవించిరో పది శ్లోకములలో చెప్పఁబడినది. నన్నయ వానిని విడిచి యయ్యుదయాస్తాచల...ఇత్యాది సమాసమున వచ్చిన రాజుల అపరిమితత్వమును జక్కఁగా సూచించెను.

39. దార సంగ్రహంబు ధరణీశ! రతిపుత్ర
ఫలము, శీల వృత్తఫలము శ్రుతము
దత్త భుక్త ఫలము ధనము, వేదము లగ్ని
హోత్రఫలము లనియు నొగి నెఱుంగు. (సభా. 1-52)

వయసభాస్థితుఁడైన ధర్మజునిఁ జూచుట కరుదెంచిన నారదుఁడు క్రొత్తగా నభిషిక్తుఁడైన యాతనికి సకలనీతి ధర్మముల నెఱింగించి యుండెను. ఆ నీతులలో నిది యొకటి.

భార్యను గ్రహించుటకు రతియు, పుత్రప్రాప్తియును ఫలములు. విద్యకు శీలమును, సద్వర్తనమును ఫలములు. ధనమునకు దానమును, భోగమును ఫలములు. వేదముల కగ్నిహోత్రమే ఫలము. ఈ పద్యము వివాహ విద్యా ధన వేదముల ఫలములను జక్కఁగా వివరించు చున్నది. నన్నయ మూల శ్లోకమును యథాతథముగా ననువదించిన పద్యములలో నిది యొకటి.

అగ్నిహోత్ర ఫలావేదా దత్తభుక్త ఫలం ధనమ్
రతిపుత్ర ఫలాదారాః శీలవృత్త ఫలంశ్రుతమ్॥

40. అనుపమశక్తిమంతులు మదాత్మజు లేవురు దేవతావరం
బున నుదయించియున్న కృతపుణ్యులు వారలలోన నగ్రజుం
డనఘుఁడు రాజసూయము మహామతిఁ జేయగ నోపుశత్రుసూ
దనుడయి సార్వభౌముఁడయి తమ్ముల బాహుబలంబు పెంపునన్.
(సభా. 1-90)

నారదుఁడు ధర్మరాజునకు దిక్పాలక సభ లన్నింటిని వర్ణించిచెప్పెను. ధర్మజుఁ డంత పాండురాజాది భూపాలు రెండఱును యమ సభనుండఁగా హరిశ్చంద్రుఁడు దేవేంద్ర

సభలో నుండుటకుఁ గారణమేమని యడిగెను. నారదుఁడెందు కతఁడు రాజసూయ యాగమొనర్చుటయే కారణమని తెల్పి పాండురాజు తనతో "ధర్మరాజు కడకేగి, రాజసూయ యాగ మొనరింపుమని ప్రోత్సహించి, తనకును నింద్రలోకప్రాప్తి కలుగఁజేయుమని చెప్పి"నట్లు తెల్పెను. ఆ సందర్భమున పాండురాజన్న వాక్యలివి.

నా కుమారులైదుగురును విస్తుల పరాక్రమశాలులు. దేవతావర సంభవులు, పుణ్యాత్ములు. వారిలో జ్యేష్ఠుఁడు పాపదూరుఁడు. తమ్ముల బాహుపరాక్రమము పెంపున శత్రువులను జయించి సార్వభౌముఁడై రాజసూయ యాగమును జేయనోపును. మహాభారత కథా నన్నివేశమున నీపద్యమునకు చాల ప్రాముఖ్య మున్నది నారదుఁడు పాండురాజు వాక్యములు ధర్మజున కెఱింగించెను. ధర్మరాజు రాజసూయము సేయుట కామాటలే ప్రేరకములైనవి. రాజసూయము దుర్యోధనుని యీర్ష్యకును, ద్యూత ద్రౌపదీ వస్త్రాపహరణములకును హేతువైనది. అవి మహాభారత యుద్ధమునకు దారి తీసినవి.

40. ఆతనిఁబట్టి యెత్తి నిహతాహితవీరుఁడు వానిముక్కునన్
వాతను గర్ణరంధ్రముల వారక శోణితధార లొల్కఁగా
వాతసుతుండు వీచె శతవారము లుద్ధతచండవాత సం
ఘాత వివర్తమాన తృణఖండసముం డగుచుండ మాగధున్.
(సభా. 1-209)

భీముఁడు జరాసంధుని సంహరించిన సందర్భమునందలి దీ పద్యము. భీముఁడు జరాసంధుని పట్టి పైకెత్తి వాని ముక్కు నుండియు, నోటి నుండియు, చెవుల నుండియు రక్తధారలొలుక, బలమైన వాయువులోఁ దిరుగుచున్న గడ్డి పరకతో సమానుఁడగుచుండ, వంద పర్యాయములు విసరివైచెను. భీముఁడు బక జరాసంధుల నొకవిధముగనే సంహరించెను. భీముని వాతసుతుఁడని పేర్కొనుటయు, జరాసంధుని తృణఖండసముఁడనుటయు నౌచిత్యశోభితములై వారి బలములందలి తారతమ్యమును జక్కఁగా వ్యక్తపఱుచు చున్నది.

41. పూజ్యుఁడ వెల్లవంశముల భూపతులందును ధర్మ నిర్మల
ప్రాజ్య విభూతి నద్దివిజపాలకునట్టిఁడ నీక యొప్పె సా
మ్రాజ్యము దైవసంపదయు మానుష సంపద పేర్మి గావునన్
యాజ్యుఁడ విప్డునీవ భరతాన్వయ భూషణ ! ధర్మనందనా !
(సభా. 1-279)

ధర్మరాజు ద్వారకనుండి కృష్ణునిఁ బిలిపించి తనచే లోకహితకరమైన యే యజ్ఞము నైనను రాజసూయ యాగమునైనను జేయింప వేడుకొనెను. అప్పుడు కృష్ణుఁ డాతనితో నిట్లనెను.

భరతాన్వయమున కలంకారభూతుఁడవైన ధర్మరాజా! నీవెల్ల వంశముల రాజులందును బూజనీయుఁడవు. ధర్మము, నిర్మలమునైన యైశ్వర్యమున దేవేంద్రు నట్టివాఁడవు. సామ్రాజ్యము దైవమానుష సంపదయు నీకు లభించినవి. అందుచే నీవిపుడు తప్పక యాగము చేయుట కర్హుఁడవై యున్నావు జరాసంధవధకు పూర్వము ధర్మజుడు రాజసూయ యాగము మొనర్చుటకు కొంత యాటంక ముండెడిది. ఇప్పుడా యాటంకము తీరినది. ధర్మజుఁడు సమ్రాట్టగుటయే కాక దైవమానుష శక్తిసంపన్నుఁడు గూడ నయ్యెను. అందుచే నతఁడు రాజసూయ యాగార్హుఁడని కృష్ణుఁడాతని నందుకు ప్రేరేచెను. ఎట్టి దుష్కర ప్రాసముననైనను నన్నయ పద్యము మకరంద ప్రవాహము వోలె ధారా శుద్ధితో జాలువారుచుండును. "అట్టిఁడే" యనగా నట్టివాఁడవేయనియర్థము.

42. ఆదిజుఁడైన బ్రహ్మయుదయంబున కాస్పదమైనవాఁడు వే
దాది సమస్త వాఙ్మయములందుఁ బ్రశంసితుఁడైన వాఁడు లో
కాది త్రిలోకపూజ్యుఁడని యాత్మనెఱింగి పితామహుండు దా
మోదరుఁ జెప్పెఁ బూజ్యుఁ డని యుక్తమ కాకిది యేమి
దోసమే. (సభా. 2-18)

శిశుపాలుడు రాజసూయయాగ సందర్భమున కృష్ణు నధిక్షేపించి సభ విడిచి వెడలి పోయినపుడు ధర్మజుఁ డాతని వెంటనే చని యనునయించుచు నిట్లు చెప్పెను. ఇందు భీష్ముఁడు పూజ్యుఁడని చెప్పుటకు కారణములు తెలుపఁబడినవి. అతఁ డాదిజుఁడైన బ్రహ్మపుట్టుకకు కారణమైన వాఁడు. వేదములు మున్నగు సమస్త వాఙ్మయములందును బ్రశంసింపఁబడినవాఁడు. జగత్తున కాదిపురుషుఁడు. మనకేకాదు ముల్లోకములకుఁ బూజనీయుఁడు. అట్టి లోకోత్తర దివ్యపురుషునిఁ బూజించుటలో దోషమేమున్నది? "వేద తత్త్వేన కృష్ణహిం భీష్మశ్చేదిపతే భృశ" మ్మను మూలమునందలి శ్లోకార్థము నకు నన్నయ చేసిన పెంపకమిది

43. పూజితుల తృప్తులగుదురు
భూజను లొరు లభ్యుతుండు పూజితుఁ డగుడుం
దేవజమున జగత్త్రితయముఁ
బూజితమై తృప్తిఁ బొందుఁ బుణ్యసమృద్ధిన్. (సభా. 2-28)

భీష్ముఁడు శిశుపాలునికిఁ గృష్ణుని సర్వలోకాతి శాయిత్వమును వివరించి చెప్పు పద్య మిది. ఇతరు లెవరినిఁ బూజించిన వారలు మాత్రమే తృప్తిఁబొందుదురు. అచ్యుతునిఁ బూజించినచో ముల్లోకములును బుణ్యవిశేషముచేఁ బూజితములై తృప్తినొందును. ఈ పద్యము చిన్నదయ్యు కృష్ణుని యనన్యసామాన్యమైన మహత్త్వమును జక్కఁగా వ్యక్తము సేయుచున్నది.

44. ఎడపక యర్ఘ్యమచ్యుతున కిచ్చితి మిచ్చిన దీనికిం దొడం
బడమని దుర్జనత్వమునఁ బల్కెడు వీరుల మస్తకంబు పై
నిడియెద నంచుఁ దాఁ జరణ మెత్తె సభన్ సహదేవుఁ డట్టిచో
నుడిగి సభాసదుల్ వలుకకుండిరి తద్దయు భీతచిత్తులై.

(సభా. 2-30)

భీష్ముఁడు శిశుపాలునికి కృష్ణుని మహత్త్వమెఱింగించు సందర్భమున సహదేవుఁడు "మేము కృష్ణున కర్ఘ్యమిచ్చితిమి. దీనికంగీకరింపమని దౌర్జన్యముతోఁబలుకు వీరుల తలపై నుంచెద"నని పలికి సభలో పాద మెత్తెను. ఆ సమయమున భయభ్రాంతులై సభాసదు లెవ్వరు నేమియుఁబలుకక యూరకుండిరి. ఇందు సహదేవుని యభిమానము, నధర్మాచరణాసహత్వమును వ్యక్తము అగుచున్నవి. రౌద్రరస విస్తృతి కర్హమైన యీ సందర్భమున నన్నయ యొక్క పద్యముతో సహదేవుని యాగ్రహమును సంక్షేప ముగాఁజెప్పుట ప్రధానరసమైన శాంతమున కపకర్ష కల్గింపకుండుటకే.

45. రయవిచల త్తురంగమ తరంగములన్ మదనాగ నక్ర సం
చయముల సంచలచ్ఛటుల సైనిక మత్స్యములన్ భయంకరం
బయి యదువృష్ణి భోజకుకురాంధక వాహినియుం గలంగె ని
ర్దయతర రోషమారుతనితాంత సమీరితమై క్షణంబునన్.

(సభా. 2-33)

శిశుపాలుని సేనాపతి స్వపక్షమునందలి క్షత్రియుల నందఱనొక్కటఁ జేర్చుకొని యుద్ధసన్నద్ధుఁడైన సమయమున యదువృష్ణిభోజాదుల వాహినులు గలంగిన విషయమును నన్నయ యీ పద్యమున వర్ణించినాఁడు.

వేగముగాఁజలించు గుఱ్ఱములనెడి కెరటములచేతను, మదించిన యేనుఁగులనెడి మొసళ్ల సముదాయములచేతను, చలించు సైనికు లనెడి మత్స్యములచేతను భీకరమై

ఘోరమైన కోపమనెడిగాలిచే ప్రేరితమై యదువృష్ణిభోజకుకురాంధకుల సేనకూడ సంక్షోభించెను. ఈ పద్యమున రూపకాలంకారమున్నది. తురంగములు తరంగముల తోడను, నాగములు నక్రములతోడను, సైనికులు మత్స్యములతోడను, రోషము మారుతముతోడను, సేనవాహినితోడను బోల్పఁబడినవి. ఈ పద్యమందలి వృత్త్యను ప్రాసము కలంగిన సేనల స్వరూపమును వ్యక్తము సేయుచున్నది.

46. కందు గల పసిఁడి గాఁచినఁ
గంది వివర్ణమయినట్లు కౌరవుకాయం
బొందఁగ వివర్ణ మయి కడు
వందె మనస్తాప హవ్యవహ దాహమునన్, (సభా. 2-89)

పాండవ సభావైభవమునుజూచి యసూయాగ్రస్తుఁడై కృశించిన దుర్యోధనుని వర్ణించు పద్యమిది.

దుర్యోధనుని దేహము బంగారువన్నెగలది. ఆతని హృదయము మాత్రము కుటిలము. అందుచే నాతనికాయము కందుగల పసిడితోఁబోల్పఁబడినది. మిశ్రితమైన బంగారము కాచిన నది వివర్ణమగును. అట్లే మనస్తాపమగు నగ్నిచేఁ గాగిన దుర్యోధనుని శరీరము మిక్కిలి వివర్ణమయ్యెను. ఇందుపమారూపకాలంకారములున్నవి.

47. అతుల పరాక్రమార్జితములైన ధనంబుల పేర్మిఁ జేసి యు
న్నతమగుచున్న పాండునరనాథ తనూజుల లక్ష్మి నా కస
మ్మతమయి సూ వెలంగె విను మాతుల! మానధనాఢ్యుఁడైన భూ
పతి సహియింప నోపునె సపత్నుల వృద్ధియు నాత్మ హానియున్
(సభా. 2-98.)

దుర్యోధనుఁడు తన శరీరకార్శ్యమునకును మనస్తాపమునకును గల కారణమును శకునికిఁదెలుపు సందర్భములోని దీపద్యము.

సాటిలేని పరాక్రమముచే సంపాదింపఁబడిన వైభవము కతమున క్రమక్రమ వర్ధితమగుచున్న పాండవుల సంపద నాకసమ్మతమయి బాధకల్గించు చున్నది. అభి మాన ధనసంపన్నుఁడైన రాజు శత్రువుల వృద్ధియు తనహానియు సహింపజాలునా! ఇందు దుర్యోధనుని యసూయాభిమానములు రెండును వ్యక్తములగుచున్నవి, ఇంద

ర్థాంతర న్యాసాలంకారముగాఁదు. రాజులు శత్రువుల వృద్ధియు స్వీయహానియు సహింపలేకపోవుట సహజము.

48. అల్పుఁడయ్యు మనుజుఁ డతిపరాక్రమమునఁ
బేర్మిఁ దరతరంబ పెరుగుచున్న
వాఁడు క్రమాని మొదలి వల్మీక మా క్రమానిఁ
జెఱుచునట్లు గడఁగి చెఱుచుఁ బగఱ. (సభా. 2-144)

దుర్యోధనుఁడు ధృతరాష్ట్రునకు తన మనస్తాపకారణమును దెలుపుచు నెట్లైన పాండవుల యైశ్వర్యమును హరించుటయే పరమార్థమని వివరించు సందర్భము నందలి పద్యమిది.

అల్పుఁడయ్యును మానవుఁ డతిపరాక్రమముతోఁ బెరుగుచున్న యెడల చెట్టు మొదటనున్నపుట్ట క్రమక్రమముగాఁ బెరిగి యా చెట్టునే చెఱుచునట్లు పూని శత్రువులను నాశనమొనరించును. ఇది రాజనీతికి సంబంధించినది. మూలమున :

"వల్మీకోమూలజ ఇవగ్రసతే వృక్షమంతికాత్" అను శ్లోకార్థమున నుపమానము సంగతియే యున్నదిగాని యుపమేయము సంగతిలేదు. నన్నయ "చెఱుచుఁ బగఱ" యని వ్రాసి యాలోపమును బూరించెను.

49. ఆ ధృతరాష్ట్రు చేసిన యనర్ఘ మణి ప్రకరానుబద్ధ శో
భా ధృతి నొప్పుచున్న సభ పార్థివముఖ్యుఁడు ధర్మజుండు దు
ర్యోధనుఁ డర్థిఁ జూపఁగ సహోదరవీరులుఁ దానుఁ జూచి ల
క్ష్మీధరమూర్తి యెంతయును మెచ్చె మనంబున దద్విభూతికిన్.
(సభా. 2-162)

ధృతరాష్ట్రుఁడు నిర్మింపఁజేసిన సభఁజూచుటకై ధృతరాష్ట్రునానతిని విదురుఁడేగి పాండవులను దీసికొని వచ్చెను. ధర్మరాజు దుర్యోధనుఁడు చూపుచుండఁగా నందలి విశేషములన్నియుఁజూచి దాని సౌందర్య సంపద కెంతయు సంతోషించెను. ఇందలి "లక్ష్మీధర మూర్తి" యను విశేషణము సాభిప్రాయమై "నావిష్ణుః పృథివీపతిః" యను నభిజ్ఞోక్తిని దలఁపించుచున్నది. మయసభనుజూచి దుర్యోధనుఁడెంత యీర్ష్యచెందెనో

ధృతరాష్ట్రుఁడు నిర్మించిన యీ సభను జూచి ధర్మరాజంత హర్షమును బొందెను. ఆ యిరువురి శీలములందలి తారతమ్యమిది.

50. మున్ను దన్నోటువడి మఱి నన్నునోటు
పడియెనో నన్ను మున్నోటువడి విభుండు
గ్రన్న దన్నోటు వడియెనో యన్న నాకు
నెఱుఁగఁ జెప్పుము దీని నీ వెఱుఁగుదేని. (సభా. 2-209)

దుర్యోధనుఁడు ద్రౌపదిని సభకుఁ దోడ్కొని రమ్మని సూతసుతుండైన ప్రాతికామినిఁ బంపెను. అతఁడు ద్రౌపది కడకేగి యా విషయము నెఱిఁగించెను. ద్రౌపది " ఏ యుగమునందును భార్యనొడ్డు కితవుడుండఁడు. ఇది యపూర్వము. ధర్మరాజిట్లు చేయునా"! యని యనుమానించుచు ప్రాతికామినట్లు ప్రశ్నించెను. ఇది ధర్మ సందేహముతోఁగూడిన ప్రశ్న. ముందే ధర్మరాజు తన్నోడినచోఁ దరువాత ద్రౌపదినొడ్డి యోడుట కతని కధికారములేదు. అందుచే ద్రౌపది యీ ప్రశ్న వేసెను. ఇచ్చట "అన్న"! యను సంబోధనము కఠిన హృదయులనుగూడ కరగించునదిగా నున్నది.

51. ఇది యుచితంబు గాదనక యిక్కురుముఖ్యులు సూచుచుండ దు
ర్మదుఁడయి వీఁడు నన్ను నవమానితఁ జేసెడి సర్వధర్మ సం
విదులన నున్న యీ భరతవీరుల వంశమునేఁ డధర్మ సం
పద నతి నింద్యమయ్యెనని భామిని గృష్ణుఁ దలంచె భీతయై.
(సభా. 2-219)

దుశ్శాసనుఁడు తన కేశములు పట్టి సభలోని కీడ్చి తేచ్చినప్పుడు ద్రౌపది కోపలజ్జా పరవశయై సభ్యులను జూచి యిట్లుపలికేను.

"కురు ముఖ్యులైన మీరందఱుఁ జూచుచుండఁగా మదాంధుఁడైన యీ దుశ్శాసనుఁ డిట్లనుచితము సేయుచున్నాఁడు. ధర్మమునకు బ్రసిద్ధిఁగాంచిన భారత వంశము నేఁడధర్మమయమై నిందద్యమగుచున్న" దని పల్కి యప్పటికిని వారూర కుండుటచే భీతయై భక్త రక్షణ తత్పరుఁడైన శ్రీకృష్ణునిఁ దలంచెను. ద్రౌపది యిందు ధర్మ విషయమును నొక్కి చెప్పెను. కాని యేమియు లాభము లేకపోయినది. ఆమె యంత ననన్యశరణ్యయై కృష్ణుఁ దలంచెను. ఇచ్చట కృష్ణునిఁ బ్రార్థించు పద్యము లెన్నియైనను వ్రాయవచ్చును. కాని కథాగమన భంగభీతిచే

నన్నయ యొక్కవాక్యమునే వ్రాసి యూరకుండెను. ఇది యాతని నిగ్రహగుణమునకుఁ దార్కాణము.

52. ధారుణి రాజ్యసంపద మదంబునఁ గోమలిఁగృష్ణఁజూచి రం
భోరు నిజోరు దేశమున నుండఁగఁబిల్చిన యిద్దురాత్ము దు
ర్వార మదీయ బాహు పరివర్తిత చండ గదాభి ఘాత భ
గ్నోరు తరోరుఁ జేయుదు సుయోధను నుగ్రరణాంతరంబునన్.
(సభా. 2-249)

దుర్యోధనుఁడు ద్రౌపదిని తన యూరుతలము నెక్కరమ్మని సన్న సేసినపుడు ప్రళయకాల దండధరఘోరాకారుఁడై సభ్యులందఱు వినుచుండ భీముఁడిట్లు పలికెను.

దుర్యోధనుఁడు ద్రౌపదిని తనయూరువునెక్క రమ్మనుట యతని రాజ్యమదాంధతకుఁ దార్కాణము. అతఁ డేయూరువు నెక్క రమ్మనెనో యా యూరువునే భగ్నము సేసెదనని భీముఁడు ప్రతిజ్ఞ యొనర్చెను. అప్పటికింకను మహాభారతసంగర ప్రసక్తిలేదు. అయినను "ఉగ్రరణాంతరంబున"నను సమాసము ముందవశ్యం భావియైన కురుక్షేత్ర సంగ్రామమును సూచించుచున్నది.

53. కనకోర్వీధర సాను సార రుచిమద్గాండీవ నిర్ముక్త ప
త్త్రి నిపీతారుణ వారి శేషముఁ బతత్త్రివ్రాతముల్ ద్రావు న
య్యని నాతోడఁ జతుర్దశాబ్దమున మాఱైపోరు కర్ణాది దు
ర్జన సంఘంబుల మార్తురం దునుముదున్ సంగ్రామ రంగంబునన్
(సభా, 2-296)

జూదమున నోడిన పిమ్మట ద్రౌపదితోఁగూడ నడవికిఁబోవుచు ధర్మజుఁడు దప్ప మిగిలిన నలుగురు పాండవులును భీషణములైన ప్రతిజ్ఞలనొనర్చిరి. అప్పుడర్జునుఁడు చేసిన ప్రతిజ్ఞయిది.

"మేరుపర్వత సానువుల కాంతివంటి కాంతిఁగల నా గాండీవమునుండి విడువఁబడిన బాణములచేఁ ద్రాగఁబడి మిగిలిన రక్తమును బక్షులుత్రాగ పదునాల్గవయేట నాతోఁబోరు కర్ణాదిదుర్జనులను సంగ్రామమున సంహరింతును. క్రోధముతోఁ జెప్పఁబడిన యీ పద్యమోజోయుతమై ద్విత్వాక్షరములతోఁగూడి రసానుగుణమైయున్నది. ఇందలి 'యని', 'సంగ్రామ' శబ్దములు భావి మహాయుద్ధ సూచకములు.

54\. వదన సరోజంబు వస్త్రాంతమునఁ గప్పి
కొనియేఁగి ధర్మనందనుఁడు మఱియు
భీమ బాహులు రెండుఁ బెద్దలుగాఁ జూచి
ఘన సత్త్వుఁ డమ్మరుత్తనయుఁ డరిగె
నిసుము చల్లుచు నమరేంద్రపుత్త్రుఁడువోయె
భూరేణు లిప్తశరీరుఁ డగుచు
నకులుండు సనియె మానక లజ్జఁజేసి య
థోవక్త్రుఁడై సహదేవుఁ డరిగె
వివృతకేశ భరము వ్రేలంగ ద్రౌపది
సనియె రౌద్రయామ్య సామగాన
ముఖరితాస్యుఁడగుచు మ్రోల ధౌమ్యుండేఁగె
సకలు జనుల శోకజలధి దేల (సభా. 2-302)

పాండవు లడవికేగు నపుడు విదురుఁడు వారువోయిన రీతి ధృతరాష్ట్రునకు వివరించి చెప్పిన పద్యమిది. నన్నయ వ్రాసిన సీసపద్యములలో మిక్కిలి ధారాశుద్ధిగలదియు వస్తుభావప్రాధాన్యము గలదియునగు పద్యమిది. పాండవులును ద్రౌపదియు నొక్కొక్క రొక్కొక్క విధముగానేగిరి. వారట్లరుగుటకు హేతువున్నది. తరువాత విదురుఁడందలి యంతరార్థము నెఱిఁగించి చెప్పెను. నకులుఁడు భూరేణులిప్తశరీరుఁడగుచును, సహదేవుఁడధోవక్త్రుఁడగుచును వెడలుటకు నన్నయ చెప్పిన కారణములు మూలమున కంటె భిన్నములై యౌచిత్యశోభితములై యున్నవి.

55\. విక్రమము విడిచి సమరా
పక్రాంతుఁడనైన నన్ను బలదేవుఁడునుం
జక్రధరసుతులు ననుజులులు
నక్రూరాదులు నేమియని నగరె సభన్. (అర. 2-171)

కృష్ణుఁడు ధర్మరాజునకు సౌంభకాఖ్యాము చెప్పు సందర్భమున సౌంభకుఁడు తీవ్ర శరములు ప్రయోగింప ప్రద్యుమ్నుఁడు మూర్ఛితుఁడైన సన్నివేశము గలదు. అతఁడు మూర్ఛనుండి తేఱి సారథితో నన్న పద్యమిది. ఇది ప్రద్యుమ్నుని యభిమానవిశేషమును సూచించుచున్నది. "ఏమియనినగరె" యను జాతీయప్రయోగము గంభీరార్థకమై యున్నది.

56. కడు నిమ్మగా దున్ని బీజములు సల్లి కర్షకుండున్నఁ
దడయక వర్షంబు గురిసి గావించు తత్ఫలసిద్ధి
నడుమఁ బర్జన్యుఁ డనుగ్రహింపని నాఁడేమిసేయుఁ
గడఁగి సేయంగలవానిఁ జేయుఁగాక కర్షకుఁడు. (అర. 1.234)

ఇది ద్రౌపది ధర్మజుల సంభాషణములోనిది. ద్రౌపది కర్మఫల ప్రాప్తికి దైవ మానుషములు రెండు నవశ్యములని చెప్పుచున్నది. కర్షకుఁడు దున్ని బీజములు చల్లి క్షేత్రమును సిద్ధము చేసినపుడు వర్షము కురిసినచో ఫలసిద్ధి గల్గును. కర్షకులఁ డెంత సేసినను బర్జన్యుఁ డనుగ్రహింపక పోయినచో లాభమేమి గల్గును?

57. అవిరళ సూర్యమండల సహస్ర సమప్రభమై ధనంజయ
ప్రవరుకరమ్మునన్ వెలుగు పాశుపతాస్త్రముఁ జూచిదైత్యదా
నవ సురయక్ష రాక్షస గణమ్ము కరమ్ము భయముఁ బొందెనం
దవనియు దిర్దిరం దిరిగె నబ్ధిశిలోచ్చయ సంచయంబుతోన్.
(అర. 1-333)

శివుడర్జునునకు పాశుపతాస్త్ర మిచ్చియంతర్హితుడయ్యెను. అప్పుడు జరిగిన విశేషములివి. ధనంజయుని చేతనున్న పాశుపతాస్త్రము సహస్ర సూర్యమండల ప్రభమై యుండెనుఁ దానిని జూచి దైత్య దానవాదులందరును మిక్కిలి భయము పొందిరి. భూమి గిరిసాగర సంఘముతో దిర్దిర దిరిగెను. "గణమ్ము కరమ్ము, భయమ్ము బొంది" యను పదము లందలి ద్విత్వమకారాను ప్రాస మాతయము యొక్క తీవ్రతను సూచించు చున్నది. ధనంజయు దనఁగా విష్ణువు, అర్జునుఁడు, అగ్నియును మూఁడర్థములున్నవి. ఇచ్చట 'ధనంజయ ప్రవరు' ననునది విశేషణోత్తర పదకర్మధారయ సమాసముగాదు. ధనంజయులలో ప్రవరుఁడని యర్థము. ఈ ప్రవరత్వమునకు పాశుపతప్రాప్తియే కారణము.

58. దానివిడిచిపోవఁ గా నోప కఱచుచు
నంతరిక్షమునను హంస లెల్లఁ
బిండు గట్టి దిరుగు చుండెవా తోద్ధూత
శారదాభ్ర శకల చయము వోలె. (అర. 2-13)

నలుఁ డుద్యాన వనమున విహరించుచు నేలకవతరించిన హంసలతో నొకహంసను బట్టుకొనెను. దాని విడిచి వెడల లేక యితర హంసలు దీనముగాఁ గూయుచు నాకాశమున గుమికట్టి తిరుగుచుండెను. చలించుచున్న యా హంసలు గాలిచేనెగురఁగొట్టఁబడిన శరత్కాలమందలి తెల్లని మేఘముల తునుకల వలెనుండెను. ఒకపక్షికి నాపద వచ్చినపుడా జాతికి జెందిన యితర పక్షులు సానుభూతి వహించి దానికై యఱచుచుండుట సహజము. నన్నయ యా పక్షిమనోవృత్తి నిచ్చటచక్కగా వర్ణించెను. శరత్కాల మేఘము లాపిరి లేనివగుటచే తెల్లగా నుండును. హంసల విందును శారదాభ్రశకలచయముతోఁ బోల్చుట యద్భుతముగా నున్నది.

59. నలదమయంతు లిద్దఱు మనః ప్రభవానల బాధ్యమానలై
సలిపిరి దీర్ఘవాసరనిశల్ విలసన్నవ నందనంబులన్
నలిన దళంబులన్ మృదుమృణాళములన్ ఘనసార పాంసులన్
దలిరులశయ్యలన్ సలిలధారలన్, చందన చారుచర్చలన్
(అర. 2-24.)

హంస దమయంతి గుణములు నలునకు, నలుని గుణములు దమయంతికి నెఱుఁగఁ జెప్పెను. ఆ వినుకలిచేతను వారిరువురు వియోగ శృంగారము. విరహతాప మడంగుటకై నల దమయంతులు నందన వనముల వంటి వనములలో, తామరాకులందును, తామరతూండ్లయందును, గర్పూరపు ధూళులందును, చిగురాకుల శయ్యలందును, జలధారలందును, గంధపుఁబూఁతల చేతను, వియోగముచే దీర్ఘతరములైన రేఁబవళ్లు గడపిరి. ఈ పద్యము నడక మనోహరముగా నున్నది. ఇందలి యొక్కొక్క యంశమునే గ్రహించి తరువాతి ప్రబంధకవులు శీతలోపచారములను విస్తరింపఁ జేసిరి. తరువాతనున్న 'కలహంస పలికిన పలుకులు గణియించు' నను సీసపద్యము గూడ నిట్లే మనోహరమై తరువాతి ప్రబంధకవులకు మార్గదర్శకమైనది.

60. కలి దమయంతిఁబాప సమకట్టు సతిం బతివాయనోపఁ డా
లలన నుదీర్ణ సౌహృదబలంబున' నిట్టులు రెంటఁ జేసి య
న్నలుఁడు విమోహరజ్జులఁ బెనంగి గతాగతకారియైన యు
య్యెలయును బోలెనూఁ జడక యెంతయుఁ బ్రొద్దు వినిశ్చితాత్ముఁడై
(అర. 2-78)

అడవిలో నిద్రించుచున్న దమయంతిని నలుఁడు విడిచిపోవయత్నించు సందర్భములోని పద్యమిది. కలి వారిరువురిని నెడఁబాపసమకట్టు చుండెను. కాని నలుఁడు గాఢాను రాగము కతమున నామెను విడిచిపోవలేకుండెను. ఈ విధముగా నొకటిముందుకును వేరొకటి వెనుకకును బోవుటకుఁ బ్రేరేచుండ నలుఁడు ముందువెనుకల కూగునుయ్యెల వలెఁ గొంతసేపు చాపల్యమును వహించి చివరికి మనస్సున నిశ్చితమొనర్చుకొని యామెను విడిచి వెడలిపోయెను. ఇచ్చటి యుపమానము రమ్యము. నన్నయ భార్యను విడిచిపోఁబోవుచున్న నలుని మనశ్చాంచల్యమును నద్భుతముగా వర్ణించెను. ఇచ్చటి 'విమోహ' శబ్దము సాభిప్రాయము. విమోహమనఁగా విశేషమోహము. దానికిచ్చట విగత మోహమనియు నర్థము చెప్పవలయును. లేనిచో నాతఁడు ముందు వెనుకల కూగులాడుట సంభవింపదు.

61. చను దెంచి తరుణీ మునినం
దనుచిత్తంబునకు వైకృతము జేసెవిలా
సినుల సహాలాప సహా
సన సహాయానములు బంధసమములుగావే (ఆది 3-111)

ఋష్యశృంగుఁడు విభాండకునితోఁ దన దగ్గఱను వచ్చిన వేశ్యను బ్రహ్మచారిగా వర్ణించి చెప్పి తదాశ్రమమున వానితోఁ గూడఁదపము సేయుట తనకు ప్రీతికరమని తెల్పెను. విభాండకుఁడు వలదని వారించి యెప్పటియట్ల వన్యఫలములు తేరనరిగెను. అప్పు డావేశ్యవచ్చి ఋశ్యశృంగుని మనమునకు వికృతి గలిగించి తనతోఁ దీసికొని పోయెను. స్త్రీలతోగలసి మాటాడుట కలసి కూర్చుండుట, కలసి వర్తించుట, యెట్టి వారికైనను బంధములే యగునని ఋశ్యశృంగుని కథద్వారా నన్నయ యీ నీతిని బోధించియున్నాడు.

62. విద్యుల్లతాంగి భార్గవు
నుద్యన్నయనములు మెఱచుచున్నను విలస
ద్ఖద్యోత ద్యుతులొకొ యని
సద్య స్సంజాతబుద్ధి సంభ్రమయగుచున్. (అర. 3-177)

సుకన్య వనమున నిష్టసఖులతోఁ దిరుగుచు నొక వాల్మీకమునందు చ్యవనుని కన్నులు మెఱయుచుండఁగా మిణుఁగురు పురుగుల కాంతి యేమోయని యప్పటికప్పుడు

పుట్టిన బుద్ధియందలి వేగిరపాటుతో నా వుట్టగ్రొప్పించెను. చ్యవను డపుడు నేత్రములు తెలచియుండుటచే నవి మెఱయుచుండెను. సుకన్య యౌవనవతి. అందుచేతనే యామెను నన్నయ 'సద్యస్సంజాతబుద్ధి సంభ్రమ'యని వర్ణించెను.

63, వడిఁబడియెఁ బిడుగులుడుగక
వడఁకె మహీతలము పాంశు వర్షము గురిసెం
గడు నెట్టినయ్యెదిశ లే
ర్పడకుండె నినుండు తిమిరపటలావృతుఁడై.
(అర. 3-369)

సౌగంధికాపహరణ కథలో భీముఁడు రాక్షసులనోడించి సౌగంధిక కమలములఁగొని యచటి వనమున విహరించుచుండఁగా ధర్మరాజాదులున్నచోటఁ గలిగిన యుత్పాతముల వర్ణించు పద్యమిది. ఇందలి 'డ'కార వృత్త్యనుప్రాసము పిడుగులు పడుచున్నవేమో యను భ్రాంతినిఁ గలిగించుచున్నది.

64, శారదరాత్రు లుజ్జ్వల లసత్తారక హారపంక్తులం
జారు తరంబులయ్యె, వికసన్నవ కైరవగంధబంధురో
దార సమీర సౌరభముఁ దాల్చి, సుధాంశువికీర్యమాణ క
ర్పూర పరాగ పాండు రుచిపూరము లంబరి పూరితములై.
(అర. 4-141)

ధర్మరాజు నహుషప్రశ్నములకు సమాధానము సెప్పి వృకోదరుందోడ్కొని నిజాశ్రమమునకు వచ్చిన పిమ్మట వర్షాకాలమేతెంచెను. తదనంతరము శరత్కాలము వచ్చెను. నన్నయ యీ పద్యమున శారదరాత్రులను చక్కగా వర్ణించెను. శరదృతువు నందలి రాత్రులు మిక్కిలి ప్రకాశించు కలువల సువాసనలతో గూడిన వాయువుల పరిమళములఁదాల్చి, చంద్రునిచే బ్రసరింపచేయఁబడుచున్న కర్పూర పరాగమువంటి తెల్లని కాంతి ప్రవాహములచే నిండి, మిక్కిలి ప్రకాశించు నక్షత్రములనెడి ముత్యాల హార పంక్తులచే సుందరతరములయ్యెను. ఈ పద్యమును, దీనిపైనున్న పద్యమును నన్నయ వర్ణన పాటవమునకు పరమోదాహరణములని చెప్పఁదగినవి. శారదరాత్రులు నిర్మలములైన వెన్నెలలకు ప్రసిద్ధిగాంచినవి. తారకములను హారపంక్తులతో పోల్చుటచే

రాత్రులందు స్త్రీత్వముద్యోతితమగుచున్నది. ఇది నన్నయ్య వ్రాసిన చివరి పద్యము. ఇచ్చట పరపూరితంబులై. యను పాఠమును గ్రహించి కొందరు నన్నయ యిక ముందు భారత భాగము పరపూరితంమగునని సూచించినట్లు చెప్పుదురు. కాని యందలి యాధార్థ్యము సందేహాస్పదము పరపూరితమనగా మిక్కిలి పూరింపబడినవని యర్థము చెప్పుకొనవలెను.

ఉన్నత గోత్రసంభవముఁ నూర్జితసత్త్వము, భద్రజాతి సం
పన్నము నుద్ధతాన్య పరిభావి మదోత్కటము న్నరేంద్ర పూ
జోన్నయ నోచితంబు నయిఁయొప్పెడు నన్నయభట్ట కుంజరం
బెన్న నిరంకుశోక్తి గతి నెందును గ్రాలుట ప్రస్తుతించెదన్.



తెలుగు ఎదలో తెలుగుతనం
వెల్లువలా పారాలని
తెలుగింటిలో తెలుగుదీపం
అఖండంగా వెలగాలని
ఈ జాతి నిద్రలేచి
మహోన్నత మానవాదర్శాల వైపు
నిరంతర కృషితో
పయనం కొనసాగించాలనే ధ్యేయంతో
ఉడుతాభక్తిగా యువభారతి కృషి చేస్తున్నది
భాషాభిమానం కలగాలంటే
మాతృభాషా సాహిత్య పఠనమే
ప్రథమ కర్తవ్యం అనే భావం
బలంగా మనసులో నాటుకోవడానికి గాను
వీలైనంత ఎక్కువ మందికి వీలైనంత తక్కువ వెలకు
ఉత్తమసాహిత్యం అందించేందుకు
యువభారతి పూనుకున్నది
ప్రతి తెలుగింటిలో
కనీసం పదయినా తెలుగు పుస్తకాలు ఉండేందుకు
మనందరం ఉద్యమ వేగంతో కృషిచేద్దాం
ఆ పదిమంచి పుస్తకాలలో ఏ ఒక్కటిగానైనా
యువభారతి ప్రచురణ ఏ ఒక్కటైనా
ఉండాలనే ధ్యేయంతో కృషిచేద్దాం

# యువభారతి

సాహితీ, సాంస్కృతిక సంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు - 3

NEW VISTAS PRINTERS, Kachiguda Chowrasta, Hyd-27.